# పౌరహక్కుల శాసనము

## [అమెరికా రాజ్యాంగము]

మూలం :

విలియం ఓ. డగ్లస్

అనువాదం :

మొక్కపాటి శివాజీ



యం. శేషాచలం అండ్ కంపెనీ.

మద్రాసు : మచిలీపట్నం : సికింద్రాబాదు.




# పౌరహక్కుల శాసనం

## [అమెరికా రాజ్యాంగం]

ఇంగ్లీషు మూలం: విలియం ఓ. డగ్లస్

అనువాదం: మొక్కపాటి శివాజీ





73

**యం. శేషాచలం అండ్ కో.**

మద్రాసు : మచిలీపట్టణం : సికిందరాబాదు

రూ. 2/-

**POURA HAKKULA SASANAM** (Amerika Rajyangam): Telugu Translation of William O. Douglas' **A Living Bill of Rights** by Mokkapati Sivaji. Published by M. Seshachalam & Co., Madras: Machilipatnam: Secunderabad: **Price: Rs. 2/-**

*First Edition: April, 1965.*

**Cover Design: Gangadhar.**



ప్రథమ ముద్రణ : ఏప్రెల్ 1965

ప్రకాశకులు :

**యం. శేషాచలం అండ్ కో.**

మద్రాసు : మచిలీపట్టణం : సికింద్రాబాదు

ముద్రణ :

ఫ్రీడమ్ ప్రెస్,

134, టి. హెచ్. రోడ్,

మద్రాసు - 21.



వెల : రూ. **2**



Regd. 212864

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్‌వారి "ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళిక చందాదారులకొరకు ప్రత్యేక ప్రచురణ.

ప్రాప్తిస్థానం :

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతిరోడ్డు : : సికింద్రాబాదు.

# 1

# స్వేచ్ఛ:
# అమెరికాలో దాని ప్రాముఖ్యత



"అమెరికా సంయుక్త రాష్ట్రాలు స్వాతంత్ర్యానికి పట్టుకొమ్మ" అంటాం.

'స్వాతంత్ర్యం' అంటే ఏమిటి? అది అమెరికన్ల నిత్య జీవితంలో ఏవిధంగా వ్యక్తం అవుతుంది? అన్న ప్రశ్నలకు సమాధానం కావాలంటే అమెరికా చరిత్రను సూక్ష్మంగా అవలోకించాలి. పదిహేడవ శతాబ్దంలో అమెరికాకు వలసవచ్చిన వారిలో ఎంతోమందికి మత స్వాతంత్ర్యం, ఆరాధనా స్వాతంత్ర్యం వారి స్వదేశాలలో కరువైపోయాయి. లోపించిన యీ స్వాతంత్ర్యాలను వెతుక్కుంటూ వారు అమెరికాదేశం వొచ్చారు. అసలు అమెరికా జాతి చరిత్రే స్వాతంత్ర్య ప్రకటనతో ప్రారంభం అయింది.

'మానవులందరూ సమానంగానే పుట్టారు. సృష్టికర్త నిర్జించరాని కొన్ని హక్కులు వారికి ప్రసాదించాడు. స్వాతంత్ర్యం అనుభవించడం, ఆనందాన్ని అన్వేషించడం, స్వేచ్ఛగా జీవించడం అనేవి యీ హక్కులలో కొన్ని అన్న విషయం నగ్నసత్యం' అని చాటింది ఈ స్వాతంత్ర్యప్రకటన.

ఐరోపీయులలో ఎంతోమందికి, 1776 నాటికి, ఈ సత్యాలు నగ్నసత్యాలుగా వ్యక్తంకాలేదు సరిగదా, వొట్టి అసంగత ప్రసంగాలుగా కూడా కనిపించాయి. అమెరికాకు వ్యక్తి

స్వాతంత్ర్యం ఆదర్శం అయితే, నిరంకుశుల పాలనలో ఉన్న దేశాలలోనూ, కమ్యూనిస్టు రాజ్యకూటమిలోను ఈ వ్యక్తి స్వాతంత్ర్యం అంగీకరింప బడటంలేదు. సమిష్టి అవసరాలకు, ఆ యా రాజ్యాలను శాసించే స్వల్పసంఖ్యాకులైన పాలకుల ఇచ్ఛలకు ఉన్న ప్రాముఖ్యం వ్యక్తుల స్వాతంత్ర్యానికి లేదు.

'స్వేచ్ఛ'కు నిర్వచనంకూడా యెరగని ఎన్నో దేశాల ప్రజలు, వ్యక్తుల స్వాతంత్ర్యాన్నిగురించి గట్టిగా మాట్లాడితే, బిత్తరపోయి చూస్తారు. ఆర్థికంగా వెనకబడ్డ దేశాలలో జనబాహుళ్యానికి, కంటికి అగుపించని స్వాతంత్ర్య జ్యోతికంటె దైనందిన అవసరాలైన తిండి, బట్ట మొదలైన వాటిమీదే గురి హెచ్చు.

అమెరికా దేశస్థులలోనే సంపన్నులెంతోమందికి, రాజ్యాంగ చట్టం, స్వాతంత్ర్య ప్రకటనలలోని వాక్యాలు తమకు వర్తించవనీ, ఎవరికోసమో, ఎన్నడో చెప్పబడ్డాయి అనీ అనిపించడం కూడా కద్దు. విప్లవకాలంనాటి ఉద్రేకం వారిలో ఏనాడో చల్లబడింది. నిరంకుశ ప్రభుత్వాలను ప్రతిఘటించిన ఏ టర్కీ విద్యార్థులదో, కొరియా విద్యార్థులదో కథ విన్నప్పుడు వారు పులకాంకితులు కావచ్చు. ఇంతమాత్రంచేత, దూరస్థుడైన ఇంగ్లీషురాజుకు వ్యతిరేకంగా ఉద్దేశింపబడిన తిరుగుబాటు వారి విప్లవం అనడం చాలా పొరపాటు. ఏ ఒక్కరికీ వ్యతిరేకంగా జరిగిన పోరాటంకాదు ఈ విప్లవం. సర్వే సర్వత్ర నియంతృత్వాన్ని ప్రతిఘటించి, స్వేచ్ఛాపూరితం అయిన వాతావరణంలోనే నివసించాలన్న ఆశయాన్ని అమెరికా రాజ్యాంగచట్టంలో ఇముడ్చుకున్నారు. ఈ కారణంగా, వారి రాజ్యాంగచట్టం ఎన్నడో గతించిన కాలానికి సంబంధించిన, బూజుపట్టివున్న

పాత కాగితాల కట్ట కాదు. అది వారి గుండెవంటిది. వారు పీల్చే గాలివలె దాని ఉనికిని వారు ప్రత్యేకంగా గుర్తించక పోయినంతమాత్రాన దాని ప్రాముఖ్యత తగ్గలేదు. 'ప్రభుత్వం అగ్నివంటిది. అది భయంగొలిపే యజమాని; ప్రమాదకరుడైన సేవకుడు' అన్నాడు జార్జివాషింగ్టన్. ఈ విషయం రాజ్యాంగ చట్టం వారికి ప్రతినిత్యమూ జ్ఞాపకంచేస్తూనే వుంటుంది.

రాజ్యాంగచట్టాన్నిగురించి సాధారణ అమెరికను పౌరునికి ఎక్కువగా తెలిసినా తెలియకపోయినా, స్వతః న్యాయదృష్టి, సాటివారి హక్కులయెడ ఆదరంమాత్రం అతనిలో ఎంతమాత్రం లోపించలేదు. ఒక్కొక్కప్పుడు శాసనసభలో ఏ అధిక సంఖ్యాకవర్గమో, సర్కారు ఉద్యోగులో, సంఘంలో వ్యక్తులవర్గాలో, తెలిసో, తెలియకో, వ్యక్తుల స్వేచ్ఛను అతిక్రమించే పనులు చేస్తూ ఉంటారు. అట్టిసమయాల్లో వారి స్వేచ్ఛ, దాని స్వరూప స్వభావాలు, స్వేచ్ఛయొక్క ఎల్లలు మొదలైన విషయాలనుగురించి చర్చించే భారం న్యాయస్థానాల పాల బడుతుంది.

# 2

## "హక్కుల పట్టీ" అంటే ఏమిటి?



సంయుక్తరాష్ట్రాల (అమెరికా) రాజ్యాంగ చట్టానికి కావించబడ్డ మొదటి పది సవరణలను 'హక్కుల పట్టీ' (Bill of Rights) అంటారు.

ఇవే 'స్వేచ్ఛ'కు సంబంధించిన వారి హక్కులు.

రాజ్యాంగ చట్టం అమలులోనికి వచ్చిన తరువాత, సుమారు మూడు సంవత్సరాలకు, డిసెంబరు 1791, 15 వ తారీఖున యివి అమలులోకి వచ్చాయి. అసలు ఈ పట్టిక తయారు కావడానికి ఒక ముఖ్యమైన కారణం ఉంది. వారి రాజ్యాంగచట్టం తయారు అవుతున్నప్పుడే, కేంద్రప్రభుత్వపు అధికారాలను అదుపులో పెట్టే హక్కుల పట్టిక ఒకటి తయారు కానున్న దన్న అభిప్రాయం రాష్ట్రాలలో వుండేది. ఇది మనసులో ఉంచుకుని ఆ రాష్ట్రాలు రాజ్యాంగచట్టాన్ని ఆమోదించాయి.

**ఈ పట్టీలోని అంశాలు :**

**సూత్రం ఒకటి :**

మత సంబంధమైన సంస్థలను గురించి కాని, అట్టి సంస్థలను నిరాటంకంగా నడుపుకునే పద్ధతిని రద్దుచేస్తూ కాని, వాక్స్వాతంత్ర్యాన్ని, పత్రికాస్వాతంత్ర్యాన్ని క్లుప్తీకరిస్తూ

కాని, శాంతియుతమైన మీటింగులవల్లను, మహజరుల ద్వారాను తమ యిక్కట్లను నివారించుకునే నిమిత్తం ప్రభుత్వాన్ని అర్థించడంలో ప్రజలకు గల హక్కును తగ్గిస్తూ కాని కాంగ్రెసు ఏ విధమైన చట్టమూ చేయరాదు.

**సూత్రం రెండు :**

స్వతంత్రమైన జాతి భద్రతకు సుశిక్షితమైన సైన్యం అవసరం కనుక, ఆయుధములు ఉంచుకొనుటయందును, వానిని ధరించుట యందును ప్రతి పౌరునికి గల హక్కు నిర్జింపబడరాదు.

**సూత్రం మూడు :**

యజమానుల అనుమతి లేకుండా యుద్ధసమయంలో కాని, శాంతి సమయంలో కాని, చట్ట సమ్మతంకాని పద్ధతిలో, పౌరుల యిండ్లలో సైనికులకు బసలు యేర్పాటు కారాదు.

**సూత్రం నాలుగు :**

ఇళ్ళు, వాకిళ్ళు, ఆస్తిపాస్తులు, పత్రాల విషయంలో వ్యక్తులకు గల హక్కులు ఏవిధంగాను నిర్జింపబడరాదు. బేసబబుగా తనిఖీలు జరుగరాదు. సరియైన కారణంలేనిదే తనిఖీపత్రాలు జారీ కారాదు. అట్టి పత్రాలు సప్రమాణమై, అధికారముద్ర కలిగి వుండడమేకాకుండా సోదా లేక తనిఖీ కావలసిన ప్రదేశం, అధికారులు హస్తగతం చేసుకోదలచిన వస్తువులు, వ్యక్తుల పూర్తి వివరాలతో పేరుపేరునా నిర్దుష్టంగా ఉల్లేఖింపబడి వుండాలి.

**సూత్రం అయిదు :**

యుద్ధసమయాలలోను, అత్యవసర పరిస్థితులలోను, శాంతిసేన, సైనికదళం లేక నౌకాదళాలలోని సభ్యులు, సాక్షిత్తూ

యుద్ధసమయాల్లో పనిచేసేటప్పుడు సంభవించిన తగాదాల విషయంలో తప్ప, ఏ వ్యక్తిగాని, ఖూనీకేసువంటి తీవ్రమైన నేరాలకు గ్రాండ్‌జ్యూరీ సమక్షంలో తప్ప సమాధానం చెప్పవలసిన అవసరంలేదు; ఒక నేరానికి ఏ వ్యక్తిగాని రెండుసార్లు శిక్షాపాత్రుడు కారాదు; తనకు వ్యతిరేకంగా సాక్ష్యం యియ్యమని ఏ విచారణలోను, బలవంతం చెయ్యబడరాదు; చట్టనిర్ణీతమైన క్రమపద్ధతిలో తప్ప స్వేచ్ఛా ప్రాణ ధనాలేవీ పౌరునినుండి వేరు చేయబడరాదు; న్యాయమైన ప్రతిఫలం యివ్వకుండా, ఏ ప్రయివేటు ఆస్తినీ ప్రజోపయోగ మిషతో ఏ ప్రభుత్వమూ తన కైవసం చేసుకోరాదు.

## సూత్రం ఆరు :

నేరం జరిగిన జిల్లాలోనే, కాలవిలంబనలేకుండా, బహిరంగంగా, ఆ రాష్ట్రంలో అదేజిల్లాకు చెందిన నిష్పక్షపాతమైన జ్యూరీ సమక్షంలో—ఏ రాష్ట్రమో ఏ జిల్లాయో చట్ట నిర్ణీతమైన పద్ధతిలో ముందే నిర్ణయింపబడి—విచారణ పొందే హక్కు ప్రతి నిందితునికి కలదు. ఇంతేకాక, క్రిమినలు చర్యలన్నిటిలో, తనపై మోపబడ్డ నేరంయొక్క స్వరూప స్వభావాలు ఏవో, ముందుగానే నిందితునికి తెలుపబడవలెను. తనకు వ్యతిరేకంగా సాక్ష్యం యివ్వవచ్చిన వారిని ముఖాముఖి ప్రశ్నించే హక్కు, తన సాక్షులను నిర్బంధంగా కోర్టుసమన్సు ద్వారా విచారణకు హాజరుపెట్టే హక్కు, విచారణలో తన తరఫున వాదించడానికి న్యాయవాదిసహాయంపొందే హక్కు ప్రతీ నిందితునికి ఉన్నాయి.

## సూత్రం ఏడు :

ఇరువది డాలర్లకు మించిన మొత్తం తగాదాకు గురి

మైనప్పుడు జ్యూరీ సమక్షంలోనే విచారణ జరిగితీరాలి. ఆ జ్యూరీ నిర్ణయించిన ఏ విషయంకాని, సామాన్య న్యాయానికి భిన్నమైన పద్ధతిలో అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ఏ న్యాయస్థానంగాని ఏవిధంగాను తిరిగి విమర్శించరాదు.

**సూత్రం ఎనిమిది :**

జామీనుగా అతిబరువైన సొమ్ము కోరబడరాదు. జరిమానాలు మితిమీరి ఉండరాదు. అతి క్రూరమైనవి కాని విపరీతమైనవి కాని శిక్షలు విధింపబడరాదు.

**సూత్రం తొమ్మిది :**

రాజ్యాంగచట్టంలో కొన్ని హక్కులు గుర్తింపబడి వుండినంత మాత్రాన, ప్రజలకు గల యితర హక్కులు ఏ విధంగాను క్లుప్తీకరించబడినట్టు అర్థం కారాదు.

**సూత్రం పది :**

సంయుక్త రాష్ట్రాలకు చెందినట్లు రాజ్యాంగచట్టంలో స్పష్టంగా వివరింపబడనివీ రాష్ట్రాలకు నిషేధింపబడినట్లు ప్రత్యేకంగా వివరింపబడనివీ అయిన అధికారాలు క్రమంగా రాష్ట్రాలకు, ప్రజలకు చెందగలవు.

మానవ హక్కుల ప్రకటనలో చేర్చడానికి, జేమ్సు మేడిసను, థామస్ జెఫర్సన్లు ఎంతగానో శ్రమించి ప్రకటనలో చేర్పించిన రక్షణలు యివి. జాన్ ఆడమ్స్ అన్నట్లు 'సర్వాధికారి, జగదీశ్వరుని నుండి మనకు దఖలు పడ్డ హక్కులిందులో ఇమిడివున్నాయి.' 'ఈ హక్కులపట్టిక ప్రజల జన్మహక్కు. అవి ప్రతి ప్రభుత్వంయెడల వర్తిస్తాయి. ఆ ప్రభుత్వం సార్వజనీనం కావచ్చు; ఒక ప్రత్యేకపక్షానికి చెందినది కావచ్చు. న్యాయబుద్ధి లవలేశమైనా కల ఏ ప్రభుత్వం

గాని, యీ హక్కులను నిరాకరించరాదు సరికదా, వీటి ఉనికి పట్ల లవలేశం సందేహంకూడా పడరాదు.' అనేవాడు థామస్ జెఫర్సన్.

న్యాయశాస్త్రంతో దైనందిన సంబంధంగల న్యాయమూర్తికి, న్యాయవాద బృందానికి అమెరికా రాజ్యాంగ చట్టంలోని ప్రజల హక్కుల రక్షణలకు రూపొందిన మొత్తం యీ హక్కుల పట్టిక.

వానిలో :

ప్రభుత్వోద్యోగులకు, ఉద్యోగాలను అర్థించేవారికి మత సంబంధమైన అర్హతలు నిర్ణయించే పద్ధతిని నిషేధించడం;

వ్యక్తుల నిర్బంధం చట్టసమ్మతం అవునా కాదా అని పరీక్షించే 'హేబియస్ కార్పస్ రిట్'ను తాత్కాలికంగానైనా అమలులోనుంచి తప్పించే ప్రయత్నాన్ని నిషేధించడం;

నేరం జరిగిన స్థలానికి సుదూరమైన ప్రదేశంలో కాక, అదేరాష్ట్రంలో విచారణ జరగాలనే నిర్ణయం;

కార్యానంతర అన్యాయ స్థిరీకరణాత్మక చట్టాల* మీద ఆంక్ష (ఈ చట్టాలు ఈనాడు పాసుచేసి గతకాలంనుండి అమలులోకి తేవడం. దీనివల్ల ఆ పనులు చేసిననాడు చట్టవిరుద్ధం కాని కార్యాలు, ఉన్నట్టుండి వెనుకనుండి చట్టవిరుద్ధం అయి పూరుకుంటాయి);

సంఘంనుండి వెలివేసి, ప్రజల పౌర హక్కులకు ఉద్వాసన చెప్పే చట్టాలపై-బిల్స్ ఆఫ్ అట్టెండర్స్‌పై నిషేధం;

దేశద్రోహ నేర నిరూపణకి, కనీసం యిద్దరు సాక్షుల వాఙ్మూలం అయినా వుండాలన్న షరతు ఉన్నాయి.

---

* **Ex Post Facto Laws.**

ఇవికాక :

పదమూడవ సవరణ విధించిన బానిసత్వ, నిర్బంధ సేవలపై నిషేధం;

సంయుక్త రాష్ట్రాలలో, పుట్టుకవల్లగాని, నివాసంవల్ల కాని, పౌరసత్వం సిద్ధించినవారు, జాతిమత విచక్షణలేకుండా తమ పౌర హక్కులు పొందగలరు (పధ్నాలుగవ సవరణ);

చట్ట నిర్ణీతమైన క్రమపద్ధతిని అతిక్రమించి, ఏ రాష్ట్రం కాని వ్యక్తులను తమ స్వేచ్ఛాధనప్రాణాలనుండి వేరు చెయ్యరాదన్న ఆదేశం (పధ్నాలుగవ సవరణ);

చట్టదత్తమైన సమానరక్షణ, అనగా చట్టం దృష్టిలో అందరూ సమానులే అన్న సూత్రం (పధ్నాలుగవ సవరణ);

కేంద్రప్రభుత్వంగాని, రాష్ట్రప్రభుత్వంగాని, జాతి మత విభేదాలు ఆధారంగా పురజనుల వోటింగు హక్కును ఏ విధంగాను క్లుప్తీకరించరాదన్న ఆజ్ఞ (పదిహేనవ సవరణ);

స్త్రీల వోటింగు హక్కును పరిరక్షించే (పంధొమ్మిదవ) సవరణ.

ఆయా రాజ్యాంగ సవరణలలో ఇమిడివున్న యీ హక్కులు, రక్షణలు అన్నీకూడా హక్కుల పట్టీగానే-హక్కుల పట్టీలో భాగాలుగానే-వ్యవహరింపబడుతూ వుంటాయి.

మొదటి పది రాజ్యాంగ సవరణలు*మాత్రమేకాక యీ సవరణలన్నీకూడా నిజానికి వారి హక్కుల పట్టీలో భాగాలే.

---

*ఆదిలో జెఫర్సన్, మేడిసన్‌లు రూపొందించిన మొదటి పది సవరణలు, కేంద్రప్రభుత్వం మీద మాత్రమే ఆంక్షలు విధించాయి. పధ్నాలుగవ అంశాలవల్ల ఈ పరిస్థితి కొంతమారింది. ఈ సవరణ ఆధారంగా హక్కుల పట్టీ సవరణలోని రాష్ట్రాలకు కూడా చెందగలవని న్యాయస్థానాలు తమ తీర్పులద్వారా నిర్ధారించాయి.

రాష్ట్రప్రభుత్వం, కేంద్రప్రభుత్వం, ప్రజల హక్కులపై దాడి చెయ్యకుండా యివికూడా అభయం ఇస్తూన్న మాటయితే వాస్తవమే కదా! ఇదికాక, ఈ రక్షణలలో ఏవో కొన్ని ప్రతిరాష్ట్రం తన రాజ్యాంగ చట్టంలో ఉల్లేఖించి వుంచింది.

రాష్ట్రపతులు, గవర్నరులు, కేంద్రశాసనసభలు, రాష్ట్రశాసనసభలు, కేంద్రప్రభుత్వాంగాలు, రాష్ట్రప్రభుత్వాంగాలు, కేంద్రన్యాయస్థానాలు, రాష్ట్రన్యాయస్థానాలు అన్నీ ఏకగ్రీవంగా తప్పక గౌరవించవలసిన హక్కులు వారికి ఉన్న మాట నిజం అని రాజ్యాంగంలోని యీ రక్షణలు చాటుతున్నాయి.

చట్టాలను చేసే అధికారం నిరవధికంగా ఉండరాదన్న పురాతన అభిప్రాయాన్ని నోట పలికినవాడు జాన్ లాక్* మహాశయుడు. "వీటి అధికారం ప్రజావసరాలకి పరిమితం అయివుంటుంది. పరిరక్షించడమే దాని లక్ష్యం. అందుచేత ప్రజల స్వేచ్ఛను తొలగించడం, వారిని ఇతర విధాలుగా నాశనం చెయ్యడం, తెలిసి తెలిసి ప్రజలను పేదరికంపాలు చెయ్యడం కాని, వాటి హక్కుల పరిధిలో ఎన్నటికీ ఉండడానికి వీలులేదు." వారి హక్కుల పట్టీ ప్రభుత్వంలో భాగాలైన మూడు అంగాలనూ అదుపులో పెడుతుంది. ప్రభుత్వశాఖలన్నిటికీ, చట్టబద్ధమైన పరిపాలన అనే అవధులు కల్పించి, అధికారులు నిర్జింప రాని పరిధుల్ని నిర్ణయించింది. సర్వాధికార సమన్వితం అయిన ప్రభుత్వంముందు ప్రాకులాడవలసిన అవసరం ప్రజలకు లేదని, నిర్భయంగా సగర్వంగా దేశంలో ప్రతి పౌరుడు తల యెత్తుకుని నడవగలడని ఘోషించింది.

అమెరికా ప్రభుత్వ తంత్రాంగానికి తొమ్మిది పది రాజ్యాంగ

---

* Treatise on Civil Government, 1690.

సవరణలు చాలా ముఖ్యమైనవి. ఇండియా, సోవియెటు రష్యా వంటి మరికొన్ని దేశాలలో కూడ ఫెడరలు రాజ్యాంగవిధానం అమలులో వున్నది. ఆ దేశాలలో రాష్ట్రాలు కేంద్రప్రభుత్వానికి అణగి వుంటాయి. కేంద్రప్రభుత్వం సృష్టించిన ప్రభుత్వాలు కావడమే దీనికి ముఖ్యకారణం. అమెరికాదేశంలో పరిణామాలు దీనికి కేవలం భిన్నమైన పద్ధతిలో నడిచాయి. ఆ దేశం రాష్ట్రాలు కేంద్రాన్ని సృష్టించాయి. కేంద్రప్రభుత్వానికి స్పష్టంగా దత్తం కాని హక్కులు రాష్ట్రాలు తామే వుంచుకున్నాయి. ఈ దృష్టితో చూస్తే, తొమ్మిది పది సవరణలలో రాష్ట్రాలకు, ప్రజలకు కేటాయించబడ్డ హక్కుల ప్రాముఖ్యము ఎంతయినా పెరుగుతుంది. కేంద్రప్రభుత్వానికి స్పష్టంగా కేటాయించబడని హక్కుల విషయాలన్నిటిలో రాష్ట్రప్రభుత్వానికి, ప్రజలకి సంపూర్ణమైన అధికారం ఉన్నది. కేంద్రప్రభుత్వానికి సంబంధించిన రాజ్యాంగ చట్టభాగాన్ని అతిక్రమించనంతకాలం, రాష్ట్రాలు తమ యిష్టంవచ్చిన ప్రభుత్వపద్ధతులు స్థిరపరుచుకోవచ్చును. ప్రజలు తమ యిష్టంవచ్చిన విధంగా స్థానిక ప్రభుత్వాలను నిర్దేశించుకోవచ్చును. వాటిని నిర్వహించుకోనూ వచ్చును.

హక్కుల పట్టీలో నిర్వచింపబడ్డవానిలో కొన్ని అంశాల ప్రాముఖ్యం తగ్గిపోయింది. వాక్స్వాతంత్ర్య, పత్రికా స్వాతంత్ర్య, సమావేశ స్వాతంత్ర్యాలు-మొదటి సవరణలోనివి ——మౌలికమైన ప్రాముఖ్యం కలవనడానికి సందేహంలేదు. కాని రెండవ సవరణలోని ఆయుధధారణను గురించి కాని, బలవంతంగా సైనికులను ప్రజల యిళ్ళమీద రుద్దడాన్ని నిషేధించిన మూడవ సవరణను గురించి కాని యిరవయ్యో శతాబ్దంలో

పౌరుడు అంతగా బాధపడకపోతే ఆశ్చర్యంలేదు. అమెరికా బ్రిటిషువారి అధీనంలో 'కాలనీ'గా ఉన్ననాటి కథ అది. ఆ నాటి పాలకులు అకార్యాలు చెయ్యనూ చేసేవారు; వాటినిగురించి ప్రత్యేకమైన అభ్యంతరాలు కూడా ఉండేవి. ఈనాడు వీటికంత ప్రాముఖ్యం లేకపోయినా, మిగిలిన రక్షణలు మాత్రం ఎంతో ముఖ్యమయినవి. రెండు మూడు సవరణలలో అంత ముఖ్యం కావనుకున్నవి కూడా ఎంతో ముఖ్యమైన ధ్యేయాన్ని ఒక దానిని గట్టిగా నిరూపిస్తా యనవచ్చును. వారి పాలనావిధానంలో పౌరశాఖలదే పైచేయి. వీటితో సమానమైన ఆధికృత సైనిక శాఖలకు లేదు. ఇదే అనాదినుండి పాతుకు పోయిన పద్ధతి. ప్రస్తుతం కూడా యీ సిద్ధాంతం యొక్క ప్రభావబలం యెంత మాత్రం తగ్గలేదన్న విషయం వారు ముందు ముందు గుర్తించగలరు.

అమెరికాలో ప్రతీ ప్రభుత్వోద్యోగి—రాష్ట్రప్రభుత్వం గాని, కేంద్రప్రభుత్వం కాని—రాజ్యాంగ చట్టాన్ని గౌరవించి, పాలిస్తానని ప్రమాణం తీసుకుంటాడు. ఆ ప్రమాణానికి కేవలం భిన్నమైన పద్ధతిలో ప్రవర్తించి ఏ వ్యక్తికోగల హక్కులను అతిక్రమించే ప్రయత్నం చేసే యెడల, అతని దుర్యత్నం నిరర్థకం చేసే బాధ్యత న్యాయస్థానాలపై ఉన్నది. ఏ ప్రభుత్వమూ లోప రహితం కాదు; కానేరదు. అమెరికను ప్రభుత్వంలో కూడా అనేక లోపాలున్నాయి. కాని రాజ్యాంగం ప్రజలకు ప్రసాదించిన హక్కులను సామాన్యంగా ప్రభుత్వోద్యోగులు గౌరవిస్తారు. ఆ విధంగా గౌరవించడం మరిచే యెడల, న్యాయస్థానాలు వారిని సరియైన దారిలో పెడతాయి.

# 3

# ప్రాథమిక స్వాతంత్ర్యాలు



అమెరికా రాజ్యాంగచట్టం తనలో ఇముడ్చుకున్న రక్షణలలో అధికభాగం స్వేచ్ఛకు పునాదివంటిది.

## వాక్స్వాతంత్ర్యము :

మానవుడు తన ఊహలను మరిఒకరికి తెలియజెప్పడం, వాటిని లిఖించి భద్రపరచడం సాధ్యంకావడంవల్ల భావాలు శిథిలంకాకుండా కాలం విధించిన స్థూలమైన అవధులు దాటి శాశ్వతంగా నిలిచిపోగలిగినవి. రాళ్ళు శిథిలం కావచ్చును కాని భావాలకు నాశంలేదు. మానవవిజ్ఞానం ఒకరితో నాశనం అయే వస్తువుకాదు. పైగా సదా పెంపొందుతుంది. ఒక తరంవారు సంపాదించిన విజ్ఞానం తరువాతి తరంవారికి విజ్ఞానార్జనకు పునాది అవుతుంది.

ఒక్కొక్కప్పుడు భాష వినేవారికి ఆవేశం కలిగించి, దుర్మార్గాలకు దారితీయించి, ప్రమాదాన్ని కలిగించవచ్చు. కాని ఆ కారణంగా వాక్కునే అణచివేయడం అంతకన్న ఎన్నోరెట్లు అధికమైన ప్రమాదానికి దారితీస్తుందన్నది చరిత్ర ప్రసిద్ధమైన సత్యం. అసలు 'అంధయుగం' అనబడే కాలం గ్రంథాలయాలు పూర్తిగా నాశనం చెయ్యబడ్డకాలం. హాన్, స్ట్రాస్‌మన్లు చేసిన ప్రయోగాలు తెలుసుకుని, లీజ్ మైట్నర్ తన అభిప్రాయాలు

ఫెర్మి, జోల్యోట్ ప్రభృతులకు తెలియజెప్పివుండకపోతే, ఈ నాటికి కూడా 'అణుశక్తి' అనేది మానవునికి లభించివుండేది కాదేమో!

భావాలను ప్రకటించడం విషయంలో రెండు విధాలైన మనఃప్రవృత్తులు ఉన్నాయి. భావాలు ప్రమాదానికి దారితీయ వచ్చును కనుక, అధికారంలో వున్నవారు ఈ భావాల ప్రకటనను అదుపులో వుంచాలన్నది ఒక దృక్పథం. ఇది కమ్యూనిస్టు వాదం. పార్టీతో ఏకీభవించనివారికి కారాగారవాసం, దేశ బహిష్కారం, లేక పరమాత్మసాయుజ్యం ప్రసాదిస్తారు వారు! నిరంకుశవాదులందరిదీ ఇంచుమించుగా ఇదేపద్ధతి. వర్జీనియా కాలనీకి గవర్నరుగా ఉన్న సర్ విలియంబెర్కిలీ, 1671 లో వెలిబుచ్చిన అభిప్రాయం ఈ దృక్పథానికి ఒక ముచ్చటైన ఉదాహరణ:

"ముద్రాలయాలు కాని, ఉచిత పాఠశాలలు కాని మాకు లేవు. అందుకు పరమాత్మునికి నా ధన్యవాదాలు. ఇంకో నూరు సంవత్సరాలదాకానైనా యివి వుండకపోతే బాగుండును! అవి ధేయత, వితండవాదం, భిన్న భిన్న దృక్పథాల తెగలు తప్ప, చదువువల్ల వచ్చిన లాభం కనిపించదు. ఎంత మంచి ప్రభుత్వానికైనా వ్యతిరేకంగా దుర్భాషల్ని, దురూహల్ని ప్రచారం చెయ్యడం మాత్రమే ముద్రాలయాలు చేసే సేవ.... ఈ రెండు సాధనాలనుండీ భగవంతుడు మనల్ని రక్షించుగాక."

స్కోప్స్ కేసు వెనుకనున్న సిద్ధాంతంకూడా యిదే. దీనినే 'ఇన్హెరిట్ ది విండ్' (Inherit the wind) అనే పేరుతో సినిమా కూడా తీశారు. బైబిలులోని 'బుక్ ఆఫ్ జెనిసిస్' (Book of Genesis) లోని సృష్టికథ బదులు, డార్విన్

వ్రాసిన సిద్ధాంతం పాఠం చెప్పినందుకుగాను ఒక స్కూలు టీచరును, 1920 ఆ ప్రాంతాలలో శిక్షించారు.*

మానవాభ్యుదయానికి పునాదివంటిదైన మనోవాక్కుల స్వేచ్ఛావిహారాన్ని అరికట్టడం అమెరికను ఆదర్శం కాదు. ఈ స్వాతంత్ర్యా లుండడంవల్ల కలిగే ఊహాజనితమైన అపాయాల కంటే, లేకపోవడంవల్ల కలిగే నిజమైన నష్టాలే ఎక్కువ అని చరిత్ర ఘోషిస్తోంది. పందొమ్మిదవ శతాబ్దపు ప్రఖ్యాత ఇంగ్లీషు రచయిత జాన్ స్టూఅర్టు మిల్ చాలా చక్కని భాషలో ఈ అభిప్రాయాన్ని వ్యక్తీకరించాడు. అంతకంటె మంచి భాషలో చెప్పడం కష్టసాధ్యం.

"మానవకోటి అంతా ఒక్క అభిప్రాయంతో వుండి, ఒక్కడు దానికిసరిగా భిన్నమైన అభిప్రాయం కలిగిఉన్నా డనుకోండి. ఆ ఒక్కడూ—తనచేతుల్లో అధికారం వుంటే—ప్రజలందరి ఏకాభిప్రాయాన్ని బైటపడనీకుండా చెయ్యడం ఎంత అక్రమమో, పదిమందీ కలిసి ఆ ఒక్కడి అభిప్రాయం బైటపడకుండా చెయ్యడం కూడా అంత అక్రమమే. ఒక ఊహ, తనకుతప్ప మరెవ్వరికీ ప్రయోజనం లేనిదయితే, ఆ ఊహను నాశనంచేస్తే బాధపడేది ఆ ఒక్కవ్యక్తే అయితే, ఆ ఆఘాతం కొద్దిమందిమీద పడ్డదా, ఎక్కువమందిమీద పడ్డదా అని మీమాంస చేయడానికైనా—ఆ స్వాతంత్ర్య నాశనం యొక్క ఫలితం దృష్ట్యా—అవకాశం ఉండవచ్చు. వచ్చిన ఖర్మం ఏమిటంటే, నిర్భయంగా అభిప్రాయాలు బైటపెట్టే అవకాశం నాశనం అయితే నష్టం యావత్తూ జాతిదే అని మనం గుర్తించాలి. తత్కాలంలోని పౌరులకు, భావిపౌరులకు ఇద్దరికీ

* Scopes v. State, 154, Tenn. 105.

నష్టం సమానమే. ఆ అభిప్రాయంతో ఏకీభవించే వారికంటె వ్యతిరేకించేవారికే నష్టం ఎక్కువ! వ్యతిరేకించే అభిప్రాయమే సరియైనదైతే, తమతప్పులు త్యజించి సత్యాన్ని గ్రహించే సౌభాగ్యం మనవారు కోలుపోయివుంటారు. వారి అభిప్రాయం సరియైనది కాకపోయినా నష్టంమాత్రం తగ్గేదిలేదు. అసత్యంతో జరిగే సంఘర్షణ ఫలితంగా సత్యాన్ని మరింత స్పష్టంగా గుర్తించి, మరింత మనోహరంగా తమ మనస్సులలో గుప్త పరుచుకునే మహావకాశం కోలుపోయివుంటారు.''

మొదటి సవరణ వెనుక గుప్తమైన మనఃప్రవృత్తి ఇదే. అందుచేతనే వాక్స్వాతంత్ర్యం, పత్రికాస్వాతంత్ర్యం క్లుప్తీకరిస్తూ చట్టం చెయ్యరాదని కాంగ్రెస్సును శాసించింది అమెరికా రాజ్యాంగ చట్టం.

అల్పసంఖ్యాకులైన అభిప్రాయంకల అమెరికా పౌరుగు వారిని వారి నమ్మకాల యెడ నమ్మకంలేని మరో పౌరుగు వారిని గూర్చి వారు ఆలోచించే పద్ధతి, వారియెడల అమెరికా ప్రవర్తించే పద్ధతి, అటువంటి అల్పసంఖ్యాకులైన వ్యక్తులు అనుభవించే స్వేచ్ఛయే స్వాతంత్ర్యానికి సరియైన నిర్వచన.

''ఊహలను పాతిపెట్టడంవల్ల కలిగే నష్టం మాత్రం వ్యక్తులతో ఆగదు. దాని ప్రభావం జాతి అంతకు చెందుతుంది'' అంటాడు మిల్ మహాశయుడు.

ప్రకటనాస్వాతంత్ర్యం, అసలు, జోడు బాటల రహదారి. వాక్కుద్వారా, వ్రాతమూలకంగా, బొమ్మలద్వారా తమ అభిప్రాయాలు వెలిబుచ్చే హక్కు అందులో ఒక భాగం. వెలువడ్డ అభిప్రాయాలు తెలుసుకోడం, పుస్తకాలు పత్రికలు చదవడం, తత్సంబంధమైన దృశ్యాలు చూడడం, కొత్త విషయాలు తెలుసు

కోవడం రెండవ హక్కు. సంభాషణకు కనీసం యిద్దరు వ్యక్తులు అవసరం. బోరిస్ పాస్టర్‌నాక్ వ్రాసిన నవల 'డాక్టర్ జివాగో' తమ దేశంలో అమ్మకం కారాదని రష్యను ప్రభుత్వం నిషేధించినప్పుడు పాస్టర్‌నాక్‌కు తన అభిప్రాయాలు ఇతరులకు తెలియజెప్పే హక్కు నశించిపోయింది. ఇంతటితో నష్టం ఆగ లేదు. నోబుల్ బహుమానం సంపాదింపగలిగిన ఉద్గ్రంథం చదివి ఆనందించే హక్కు సోవియట్ ప్రజలకు పోయింది.

వాక్స్వాతంత్ర్యం, పత్రికాస్వాతంత్ర్యం - ఈ రెంటిని గురించి అమెరికా రాజ్యాంగ చట్టంలో వివరించబడింది. వార్తా పత్రికల సంపాదకులమీద, రచయితలమీద, ఉపన్యాసకులమీదా ఏవిధమైన ఆంక్షలు, అడ్డులు పెట్టరాదని ఆ రాజ్యాంగం నిర్ణయించింది. అయితే, 'సెన్సారుషిప్' నుండి సినిమాలను, టెలివిజన్‌ను ఈ వాక్యం రక్షిస్తుందా? ఈ ప్రశ్నకు యింతవరకు న్యాయస్థానాలు సమాధానం ఇయ్యలేదు. సెన్సారుషిప్పు అన్ని రూపాలలోనూ నిషేధమే అని చాలా మంది అభిప్రాయం. అసలు సెన్సారు పద్ధతికి వ్యతిరేకంగా ఉన్న వాదం సుస్పష్టమే. 'మన ఊహలు, మన నమ్మకాలు, మన రుచులు, ఫలానా విధంగా ఉండాలి' అని చెప్పే అధికారం ఏ వ్యక్తికీ లేదు. 'ఇది ఉత్తమం, ఇది అధమం' అని నిర్ణయించే అధికారం ఏ ప్రభుత్వోద్యోగికి లేదు. సినిమాలు, సాహిత్యం, బొమ్మలు, వ్యంగ్య చిత్రాలు, చెక్కడాలు మొదలైనవి ముఖ్యంగా జనరంజనానికే ఉద్దేశింపబడ్డా ముఖ్యమైన అనేక అంశాలు వీటివల్ల గుప్తంగా ప్రచారం అయేమాట వాస్తవం. ప్రభుత్వాధికారి వెలువరించిన అభిప్రాయం ఆధారంగా చేసుకుని, ఒక సాహిత్యసృష్టి విలువ లేనిదని కాని, ఒక రాజకీయవర్గం వారికి కష్టం కలిగిస్తున్న

దన్న మిషతో కాని, తత్తత్ప్రచురణలను నిలిపివేస్తే - ప్రచురణ స్వాతంత్ర్యాన్ని తద్ద్వారా క్లుప్తీకరిస్తే-మనకు నచ్చని గొంతులు నొక్కి-వేయడానికి మంచి ఆయుధం సంపాదించిన వారం అవుతాము. మాటవరసకు, ఉత్తమసాహిత్యానికి ఉండవలసిన లక్షణాలు 'అంకుల్ టామ్స్ కేబిన్'లో ఎంతవరకు ఉన్నాయో చెప్పలేము కాని ప్రజల భావాలను ఆ పుస్తకం ఎంత గొప్పగా ప్రభావితం చేసిందో మనం గుర్తుంచుకోవాలి.

సత్యదూరం అయిన వార్తలు ప్రచురించి, నిర్మలమైన తన కీర్తికాయానికి కళంకం ఆపాదించిన తుంటరిమీద మాననష్టం దావా తెచ్చి ఒక వ్యక్తి తనను తాను రక్షించుకోగలడు. ఇటువంటి సమయాల్లో మాననష్టపు దావా చాలా ఉపయోగకారి. మొదటి సవరణ ఈ దావాలను నిషేధించినట్లు కనిపించవచ్చు కాని, అమెరికన్ యూనియన్ పుట్టకపూర్వంనుంచి అనుశ్రుతంగా రాష్ట్రాలు ఈ ప్రక్రియకు అనుమతించేవి. అటు తరువాత కూడా అనుమతిస్తూనే వున్నవి. ప్రభుత్వాల చర్యలను గురించి, ఒకానొక వ్యక్తికి ప్రభుత్వోద్యోగం సంపాదించడానికి గల అర్హతలను గురించి బాహాటంగా తమ అభిప్రాయాలు వెలిబుచ్చడంతో ఆగక తీవ్రంగా విమర్శించడం కూడా ప్రజలకుగల హక్కులుగా చట్టం గుర్తిస్తోంది. దారిని పోయే వ్యక్తి ఒకడు "యివి అబద్ధాలు" అన్నంతమాత్రాన, ప్రజానీకానికి సంబంధించిన విషయాలలో అభిప్రాయాల ప్రకటన నిషేధం కాదు; కారాదు. ఈ నిషేధం లేని కారణంగా, ప్రజాహితకార్యాలపట్ల విరివిగా చర్చలు జరిగే అవకాశం ఉంది.

అభిప్రాయాలు సత్యదూరాలు, అపాయంలో కూడు కొన్నవి అన్న మిషలతో అణచివేయడాన్ని సమర్థించేవారు

కూడా చాలామంది ఉన్నారు. ఇది అనాదినుండి జరుగుతున్న పనే. ఈ వాదమూ కొత్తది కాదు. ఇట్టి 'అసత్య సిద్ధాంతాల' కోసం 'జెహాద్‌లు' (మతంకోసం పోరాటాలు) ఘోరంగా జరిగాయి. నాస్తికవాదమని, సత్యదూరం అని శాస్త్రజ్ఞులు కనిపెట్టిన నూతన విషయాలు తీవ్రంగా ఖండింపబడ్డాయి. అధికారంలో ఉన్నవారు తమకు నచ్చని విషయాల నన్నిటినీ భ్రమ ప్రమాదాలతో కూడిన సంగతు లని ఖండించడం చాలా సులువైన పని. తమ మతాన్ని, తమ నైతికసిద్ధాంతాలను విపులీకరించే కళ వాఙ్మయం మాత్రమే తయారుకావా లంటారు కొందరు. లైంగిక విషయాలపై పుస్తకాలు వ్రాసిన వారిని, ప్రచురించిన వారిని శిక్షించడంలో ఎంతో దూరం పోయినవారు మరికొందరు. 'అశ్లీలా' లనబడే పుస్తకాలు ప్రచురించిన నేరం 'జ్యూరీ' మాత్రమే విచారించాలి. పత్రికా స్వాతంత్ర్యానికి యిది రక్ష రేకువంటిది. 'సెన్సారు' చేతులో అధికారం కేంద్రీకృతం అయితే ఒక్క కలంపోటుతో ఎంతటి ప్రచురణనైనా అతడు నిలిపి వేయగలడు. దీనికి బదులు, ప్రభుత్వాభిప్రాయాలతో జ్యూరీని ఏకీభవించేటట్లు చేసి నిందితుడైన రచయితను, ప్రచురణకర్తను శిక్షపాలు చెయ్యడం ఎంతో ప్రయాసతో కూడుకున్న విషయం. అంత ప్రయాసకు లోనయినా ప్రయత్నం విజయవంతం అవుతుం దనే ధైర్యంకూడా ఉండదు.

అశ్లీలదోషారోపణనుండి వాఙ్మయాన్ని రక్షించడంలో న్యాయస్థానాలు చాలా సహకరించాయి. ఏదైనా ఒక పుస్తకం 'అశ్లీలం' అనేముందు పుస్తకం అంతా పరిశీలించాలి. కొంత భాగం పచ్చిపచ్చిగా వున్నంతమాత్రాన, పుస్తకాన్ని మొత్తం అశ్లీలం అని నిందించడానికి వీలులేదు. ఎంతో జుగుప్సాకరం

గాను, అసహ్యంగాను వుంటేనే తప్ప న్యాయస్థానాలు ప్రచురణలను అణచివేయడం లేదు.[1]

ఘాటైన ఉపన్యాసాలు శాంతికి భంగం కలిగించవచ్చు ననే మిష వాక్స్వాతంత్ర్యం అరికట్టడానికి మరో కారణం. అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు విరివిగా ఉపయోగించి వక్తలు సులువుగా నేరారోపణలు చేసే మాట వాస్తవమే. చౌరస్తాల లోను, పార్కులలోను, యితర బహిరంగస్థలాలలోను వక్తల ఉపన్యాసాల మధ్య పిల్లికూతలు, నక్కకూతలు పెట్టి, ఎగతాళి చేసి, కొంతమంది శ్రోతలు కార్యక్రమానికి అంతరాయం కూడా కల్పిస్తారు. అట్టి సందర్భాలలో ఉపన్యాసకులను రక్షించడం పోలీసుల విధి. శాంతికి భంగం కలిగే అవకాశం పూర్తిగా దగ్గరపడ్డప్పుడు, హింసాత్మకచర్యల వైపు శ్రోతలను ఉపన్యాసకుడు అతిగా ప్రోత్సహించినప్పుడు మాత్రమే అతని నోటికి తాళం వేయడం మంచిది.[2]

ఉపన్యాసవాయువులతో తమ వేడిని తగ్గించుకునే వక్తలతో లండన్‌లోని హైడ్‌పార్కు చాలా ప్రసిద్ధి కెక్కింది. అమెరికాలో కూడా యీ హైడ్‌పార్కు అలవాటు ఉంది. వీధి చివర నిలబడి, ఉద్రేకపూరితంగా ఉపన్యాసకులు కొంతమంది, సత్యాసత్యాలు కలిసిన ఫిర్యాదులతో అమెరికాలోని ఉన్నతాతి ఉన్నతమైన అధికారుల్ని గడ్డిపరకకు కాకుండా ఖండించి పార వెయ్యవచ్చును. ఇట్టి ఉపన్యాసకులు శిక్షాపాత్రులు కారు సరి కదా, వారిమీద నేరంకూడా ఆరోపించబడదు. హింసాత్మక

1. Roth V. United States, 354 U.S. 476.
2. Feiner V. New York, 340, U. S. 315;
Beauharnais V Illinois 343, U. S. 250.

చర్యలకు పూనుకొనేటట్లు ప్రజలను రెచ్చకొడితే తప్ప ఉప న్యాసకులు వారి గొంతు వారు చించుకొని వారిదారిన వారు పోవచ్చు.

తమ సిద్ధాంతాలను ప్రచారంచేసే హక్కు కమ్యూనిష్టు లకు ఉన్నదా అన్నది ఈ సందర్భంలో ఉత్పన్నమయే ముఖ్య మైన ప్రశ్న. తనను తాను శత్రువులనుండి రక్షించుకునే అధి కారం ప్రతి ప్రభుత్వానికి ఉంది. వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని నమ్మే దేశాల్లో విద్యార్థులు, విద్యాధికులు అన్నవారు మార్క్సు, లెనిన్, స్టాలిన్ ప్రభృతుల గ్రంథాలు చదివే హక్కు ఉన్నదా? చట్టానికి వ్యతిరేకించకుండా కమ్యూనిష్టు లీ రచనలను ఎంత వరకు ఉపయోగించగలరు? కమ్యూనిష్టు సిద్ధాంతాలను అవగాహన చేసుకునే నిమిత్తం, తమకు నచ్చకపోతే వాటిని ఖండించే నిమిత్తం ఏతత్సంబంధమైన పుస్తకాలు చదవడం ధర్మమే. కాని యివే గ్రంథాల సహాయంతో కమ్యూనిష్టులు యితర కమ్యూనిష్టులకు, కమ్యూనిష్టు సిద్ధాంతంయెడ సానుభూతి కల వారికి విజ్ఞానప్రాప్తి కలిగించడం ఒక నేరంగా అమెరికా శాసన సభ నిర్ణయించవచ్చునా? అవును, నేరమేనని న్యాయస్థానాలు దీనికి సమాధానం యిచ్చాయి. మున్ముందు కనుచూపుమేరలో అమెరికా రాజ్యాంగం కమ్యూనిష్టుల కైవసం అయ్యే సూచనలు ఎంతమాత్రం లేకపోయినా, జాతీయ, రాష్ట్రీయ స్థానికస్థాయీ లలో పరిపాలన కమ్యూనిష్టుల కైవసం అయే అవకాశం భావిలో ఈషణ్మాత్రం కనిపించకపోయినా, న్యాయస్థానాలు యిట్టి తీర్పును యిచ్చాయి.* అలా నిర్ణయించడంలో విట్నీ కేసులో† న్యాయ

* Dennis V United States, 341 U.S. 494.
† Whitney V California 274, U.S. 357, 377.

మూర్తి బ్రాండీస్ విశదీకరించిన సిద్ధాంతానికి అమెరికన్ న్యాయ స్థానాలు పూర్తిగా వ్యతిరేకించా యని నా అభిప్రాయం.

"అవక తవకలు, అబద్ధాలు, చర్చలద్వారా బైటపెట్టే అవకాశమే వుంటే, విద్యావిధానంద్వారా ఇక్కట్లు నివారించు కునే అవకాశం వుంటే, చెయ్యవలసింది నోళ్ళకు తాళం వెయ్యడం కాదు, వేసిన తాళాలు విప్పడం" అన్నా రాయన.

వాక్కు, పత్రికా స్వాతంత్ర్యాల విషయంలో కేంద్ర ప్రభుత్వానికి మొదటి సవరణద్వారా మన రాజ్యాంగం ఎట్టి అధికారమూ దఖలుపరచలేదని మేడిసన్ అభిప్రాయం. సంఘ క్షేమానికి ఈ రెండు స్వాతంత్ర్యాలూ ఎంతో అవసరం అని గుర్తించి అమెరికన్ న్యాయస్థానాలు మొదటి సవరణలోని స్వాతంత్ర్యరక్షణ కేంద్రరాష్ట్రప్రభుత్వాల కార్యాలన్నిటికి వర్తి స్తుందని (ముఖ్యంగా 14 వ సవరణలోని 'చట్ట నిర్ణీతమైన క్రమ పద్ధతి' ననుసరించి) నిర్ణయించాయి.*

## సమావేశ స్వాతంత్ర్యం :

తనతో సమానాభిప్రాయాలు గల వారితో కలిసి సమా వేశాలలో పాల్గొనడం కాని, తనవంటి అభిప్రాయాలు గలవారి సంఘానికి తన అభిప్రాయబలాన్ని చేకూర్చడం కాని నేరం అయితే వాక్స్వాతంత్ర్యం అనే పదానికి అర్థం లేదు. మొదటి సవరణలో రక్షింపబడ్డ సమావేశహక్కు—శాంతియుతంగా నలు గురితో కలసి సంఘాలుగా ఏర్పడడం, మాటా మంతీ ఆడుకోడం మొదలైన వాటికి గల హక్కు-వాక్స్వాతంత్ర్యంవలెనే మౌలిక మైన ప్రాముఖ్యం కలది.

---

* Gitlow V New York 268, U.S. 652, 666.

ఈ హక్కులు ప్రజలందరికి సమానం. ప్రజాహిత సమస్యలు చర్చించే నిమిత్తం కమ్యూనిష్టులు కొందరు శాంతియుతంగా సమావేశం కాబోతే ప్రభుత్వం వారిని శిక్షించింది. తదుపరి కోర్టుముందు తేబడిన అభియోగంలో* కోర్టువారు ఈ సమావేశహక్కు అందరికి సమానం అని తేల్చారు. హింసాత్మక చర్యలకు దారితీస్తే, నేరాలు చెయ్యడాన్ని ప్రోత్సహిస్తే, ఈ సమావేశాలు హక్కును దుర్వినియోగం చేస్తున్నాయన్న మాట. అట్టి సందర్భాలలో ప్రభుత్వాలు చర్యతీసుకోవచ్చు. మన వ్యతిరేకులు, అయిష్టులు చట్టబద్ధంగా సమావేశం అయినంతమాత్రాన దోషం కాజాలదు. "ఆ సమావేశంలో పాల్గొనే వ్యక్తులు యితరత్రా నేరాలు చేసివుండి, ప్రజాశాంతికి, భద్రతకు భంగం కలిగించే లక్ష్యంతో కుట్రలు పన్నదలుచుకున్నా, సాక్షాత్తూ కుట్ర చేస్తున్నట్టు తెలిసినా అట్టి వ్యక్తులను వారు ఇతర చట్టాలను వేటినైనా ఉల్లంఘించినట్టయితే శిక్షించడం ధర్మమే. దానిని వదిలిపెట్టి, శాంతియుతంగా సమావేశం అయినందుకు న్యాయసమ్మతంగా బహిరంగ చర్చలో పాల్గొన్నందుకు శిక్షించాలనుకోడం వేరే విషయం" అన్నది కోర్టు.

సమావేశాలు శాంతిభద్రతలకు ఏవిధమైన భంగం కలిగించకుండా వుండాలంటే ఏ కొద్దిపాటి చర్యో తీసుకోవడం తరుచు అవసరమేమో! ఉదాహరణకు-రోడ్డు మధ్యగా మీటింగు పెట్టరాదు. విపరీతమైన గోల, కొట్లాటలు, రాకపోకలకు అడ్డంకులు కలుగకుండ కొంత చర్య తీసుకోవచ్చు. కాని యీ చర్యలు వాక్స్వాతంత్ర్యాన్ని క్లుప్తీకరించడానికి మిషలుగా మాత్రం ఉపయోగపడరాదు.

---

*De Jonge V Oregan, 299 U.S. 353.

ఒక వ్యక్తి చదువదలుచుకున్న వాటిమీద కాని, వ్రాసే వాటిమీద కాని ప్రభుత్వం ఆంక్షలు పెట్టరాదు. భావాలమీద ప్రభుత్వానికి ఏవిధమైన అధికారంలేదు. వ్యక్తి చదివే పుస్తకాల పేర్లను చెప్పిస్తే - అది బహిరంగంచేస్తే - అతని ఆలోచనల్ని కొద్దో గొప్పో అదుపులో పెట్టే ప్రయత్నం చెయ్యగల మనుకోవచ్చు. అనతికాలంలో ఎప్పుడు పుస్తకం తీసినా, వారి వెనకాల ప్రభుత్వాధికారి ఒకడు నిలబడేవుంటాడు, వారు ఏం చదువుతున్నారో వ్రాసుకొనిపోడానికి. ప్రభుత్వానికి యిష్టంలేని పుస్తకాలు వ్రాసేవారిమీదా, చదివేవారిమీదా ప్రభుత్వంవారి ఛాయ పడుతోనేవుంటుంది. తను చదివే పుస్తకాలు, పత్రికలు, సాధించే వ్యక్తుల స్నేహాలు, తనకు సభ్యత్వం గల సంఘాలలోనే వ్యక్తిపరమైన స్వాతంత్ర్యం, దాని నావహించుకొనే చాటు, మరుగు ఇమిడివుంటాయి. ఈ అంశాలను నిర్ణీతంచేసి శాసించే హక్కు ప్రభుత్వానికి ఎంతమాత్రం లేదు. వాటినిగురించి దర్యాప్తుచేసే హక్కు అంతకుముందే లేదు. తాను ప్రచురించే పుస్తకాలకు చందాదారు లెవరో చెప్పమని ఏ ప్రచురణకర్తనూ ప్రభుత్వం బలవంతం చేయరాదు. అట్టి నిర్బంధంవల్ల అతని హక్కులుమాత్రమే కాదు, వేలాది చదువరుల వాక్స్వాతంత్ర్యంకూడా 'సహేంద్ర తక్షకాయ స్వాహా' అని బూడిదపాలవుతుంది.* అదేవిధంగా చట్టబద్ధమైన ఆశయాల సాధనకై పాటుబడే ఏ సంఘాన్ని కాని తన సభ్యులెవరో చెప్పమని బలవంతం చెయ్యడం, అదేవిధంగా తాను సభ్యుడైన సంఘాలపేర్లు చెప్పమని వ్యక్తులను బలవంతం చెయ్యడం, రెండూ ప్రభుత్వంపట్ల కానిపనులే. జనబాహుళ్యంయొక్క

* U. S. V. Rumely, 345. U.S. 41, 56.

ఆదరంపొందని ధ్యేయాలు సాధించే సంఘాలకు చాటు, మరుగు మొక్కలకు ఎరువు, నీరు వంటివి. ఆ మరుగు ప్రభుత్వం తన పొట్టబెట్టుకుంటే ఆ మొక్కను వేళ్ళతో సహా పీకి అవతల పార వేసినట్టే.* బైట పడినందువల్ల, చెప్పుకోదగ్గ నష్టం లేక పోవచ్చు. అయినా, ఒక వ్యక్తియొక్క స్నేహాలు, అతడు సభ్యుడైన మత సంఘాలు, అతని నమ్మకాలు అతని భావాల వలెనే, మొదటి సవరణ ధర్మమా అని, ప్రభుత్వ ఆజమా యిషీ క్రిందికి రావు. వారి స్నేహితులను నిర్ణయించే అధికారం లేని ప్రభుత్వానికి వారి స్నేహితుల పేళ్ళు గుప్తంగా ఉంచు కుంటే శిక్షించే అధికారం మాత్రం యెక్కడిది?

## మతస్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం ; మరుగుగా జీవించే హక్కు :

వ్యక్తి చేసే ఆలోచనలవల్ల సంఘానికి కించిత్తూ నష్టం కలిగే అవకాశం వున్నట్టు కనిపించదు. కాగా, మన భావాలు, నమ్మకాలు ప్రభుత్వాల ఆంక్షలకు గురికారాదు. ప్రభువుయెడ అవిధేయమైన ఆలోచనలు చేసినందుకు-అతని మరణం కోరడం మొదలైనవి-ఇంగ్లండులో శిక్షకు గురి అయ్యే రోజులుకూడా వుండేవి. పదమూడు పదిహేడు శతాబ్దాల మధ్యకాలంలో మత సంబంధమైన న్యాయస్థానాలు, తదుపరి 'స్టార్ ఛేంబర్' పేరుతో ఏర్పడ్డ రాజుగారి న్యాయస్థానంవంటివి, చిత్రవధ చేసి, హింస పెట్టి, ప్రజల నమ్మకా లేమిటో కనుక్కొని, మతపరంగా వారి భావా లేమిటో ఆచూకీ తీసి, రాజుయెడ ఎంతమాత్రం

* N.A.A.C. P. V Alabama, 357 U.S. 449

అవిధేయత కనిపించినా, మతపరంగా ఎంతమాత్రం అవిశ్వాసం కనిపించినా, ప్రజలను తీవ్రశిక్షకు గురిచేసేవి. ఆదిలో ఆంగ్ల రాజన్యులు రాజ్యానికేకాక, మతానికి కూడా సర్వాధికారులని, వారియెడల సదా విధేయులై వుంటామని ప్రజలు ప్రమాణాలు చేయవలసివచ్చేది.

ఎనిమిదవ హెన్రీ రాజు కాలంలో రోమను పోపు యొక్క శక్తిమీద, అతని అధికారంమీద నమ్మకం బొత్తుగా లేదని ప్రకటిస్తూ ప్రమాణం చేసేవారు. ఇది బలవంతంగానే జరిగేది.

హెన్రీతరువాత రాజ్యానికి వచ్చిన మేరీరాణి కాలంలో, ఆమె తండ్రికాలంలో చేసిన ప్రమాణం తప్పు అని మరో ప్రమాణం చేయవలసివచ్చేది ప్రజలు.

ఎలిజబెత్తు రాణికూడా తన ప్రజలచేత ప్రమాణాలు చేయించేది: "శ్రీశ్రీశ్రీ మహారాణీ వారొక్కరే ఈ రాజ్యం మొత్తానికి సర్వాధికారి. భౌతిక ఆధ్యాత్మిక మతసంబంధమైన విషయాలన్నిటిలోనూ మహారాణివారి అధికారాన్ని మాత్రమే నేను గుర్తిస్తాను" అన్న వాక్యాలు ప్రతీపౌరుడూ తీసుకోవలసిన ప్రమాణంలో ఒక భాగం.

మొదటి జేమ్సురాజు కాలంలో: రాజుగారికి తాము ఎల్లప్పుడూ విధేయులం అయివుంటామని ప్రతిజ్ఞచేసిన పిదప, 'ఈ ప్రతిజ్ఞ నా సమ్మతిని తీసుకున్నది. న్యాయసమ్మతమైన పద్ధతిలో నాకు యివ్వబడినది. ఈ ప్రతిజ్ఞనుండి క్షమాపణలు వగైరాలన్నీ ఇందుమూలముగా వదిలివేయడమే కాకుండా, ఈ ప్రతిజ్ఞను భంగంచెయ్యమని నన్ను ప్రోత్సహించడం కాని, భంగం అయినప్పుడు నాకు సంక్రమించే దుష్కృతాన్నుండి

పోవుగాని, మరే మతాధికారియొక్క అధికారంకాని నన్ను రక్షించలేదని హృదయపూర్వకంగా నేను నమ్ముతున్నాను,' అనేవారు.

రెండవ ప్రపంచయుద్ధం తరువాత దేశంయెడ విధేయతను పరీక్షించే ఉద్దేశంతో పెట్టబడిన దేశభక్తి ప్రమాణాల జాడ్యం విరివిగా ప్రబలింది. స్థానికసంస్థలలో ఉద్యోగుల దగ్గర నుంచి కేంద్రప్రభుత్వ అధికారులదాకా ప్రతి ఉద్యోగానికి, రకరకాల దేశభక్తినిరూపకప్రమాణాల ముసాయిదాలు ఉండేవి. ఓటర్లు, ఇళ్ళ కిరాయిదార్లు, అధ్యాపకులు, ప్రభుత్వసహాయం తీసుకునేవారు, కేంద్ర ప్రభుత్వాధికారులు, పన్నులనుండి విరామం కోరేవారు (మతసంస్థలు, మాజీ సైనికులువంటివారు) చివరికి ముష్టియుద్ధంచేసే బాక్సరు దగ్గరనుంచి కుస్తీపట్టే పైల్వానుల దగ్గరనుంచికూడా యీ ప్రమాణాలు తీసుకోవలసి వచ్చేది.

వ్యక్తుల నమ్మకాలతో ప్రభుత్వానికి ఏవిధమైన సంబంధమూ లేదని అమెరికా రాజ్యాంగచట్టం స్పష్టంగా నిర్ణయించింది. యుద్ధసమయంలోకూడ, శత్రువుయెడ కేవలం సానుభూతి మాత్రమే వుంటే అది దేశద్రోహంనేరంక్రిందికి రాదు. దానికి ఏవిధమైన శిక్ష విధింపబడదు. ఆ సానుభూతి ననుసరించి ఏదైనా పని - శత్రువులకు సహాయకరం అయేపని ఏదన్నా - చేసినప్పుడే అది నేరంక్రిందికి వస్తుంది. దేశద్రోహం అంటే- అమెరికా రాజ్యాంగ చట్ట పరిభాషలో 'శత్రువుకు సౌకర్యాలు, సహాయం కల్పించడం.'

భావనాస్వాతంత్ర్యానికి దగ్గర సంబంధం వున్నవి రెండు. ఒకటి: వారి నమ్మకాలు వారివిగా ఉంచుకొనే హక్కు. రెండు:

అనవసరమైన అడ్డంకులు లేకుండా వారి జీవితం వారు గడపి వారి వ్యక్తిత్వాన్ని వారు రక్షించుకునే హక్కు. క్రైస్తవులు, క్రైస్తవేతరులు, నాస్తికులు, ముసల్మానులు, యూదులు మొదలైన వా రెవ్వరూ వారిమతం కారణంగా పౌరహక్కులకు దూరం చెయ్యబడరాదని జెఫర్‌సన్ అభిప్రాయం. లాక్ మహాశయునితో అతను పూర్తిగా ఏకీభవించాడు. 'మతాంతరులపట్ల సహనం లేకపోవడమే మతకలహాలకు కారణం' అని 1776 లో అతను వ్రాశాడు. ప్రభుత్వాధికారానికి, ప్రోటస్టెంట్లకు ఎంత హక్కు వున్నదో అంతే హక్కు ముస్లిములకు, కాథలిక్కులకు, హిందువులకు, యూదులకు, క్వేకర్లకూ ఉండాలని అతని ఊహ. అందుచేత ప్రభుత్వోద్యోగాలకు, దానికి సంబంధించిన వాటికి దేనికీకూడా మతసంబంధమైన అర్హతలు బొత్తుగా ఉండరాదని ఆ రాజ్యాంగచట్టం నిషేధించింది. వాక్స్వాతంత్ర్య, మత స్వాతంత్ర్యాలతోబాటు భావనాస్వాతంత్ర్యం, సమ్మేళనస్వాతంత్ర్యంకూడా రక్షింపబడుతాయి. మతస్వాతంత్ర్యానికి కేంద్రప్రభుత్వ చర్యలనుండి మొదటి సవరణవల్ల రక్షణ లభిస్తుంది. పద్నాలుగవ సవరణలోని 'చట్టసమ్మతమైన క్రమ పద్ధతి' అన్న అంశం ధర్మమా అని రాష్ట్రాల చర్యలనుండి కూడా ప్రజలకు అదేరక్షణ లభిస్తుంది.*

స్కూలుపిల్లలు 'జెండావందనం చెయ్యము' అని నిరాకరిస్తే ఏమవుతుంది? అన్న ప్రశ్నకు సమాధానమా అన్నట్లు ఒక చిన్న సంఘటన జరిగింది. యెహోవా సాక్షులు† (ప్రోటస్టెంట్లలో ఒక తెగ) అనే వారికి ఎక్సోడస్ 20, వాక్యాలు 4,5

---

* Murdock V Pennsylvania 319 U.S. 105.

† Jehova's Witnesses.

మీద నమ్మకం హెచ్చు. 'నీవు ఎటువంటి కృత్రిమమైన విగ్రహాన్ని నీముందు ఉంచుకోరాదు....నీవు వాటికి ప్రణామం చెయ్యకు....వానిని సేవించకు' అని ఆవాక్యాలు ఆదేశించాయి. పతాకానికి వందనపురస్సరంగా చెయ్యి యెత్తితే, యెహోవా ఉపదేశానికి కేవలం విరుద్ధంగా కృత్రిమమైన ఒక విగ్రహానికి నమస్కరించినట్లు, దానిని సేవించినట్లు వారు భావించారు. ఈ విషయంమీద వారికి చాలా గట్టి నమ్మకం వుండేది. పతాకానికి వందనం చేయడం నిరాకరించారన్న కారణంగా పిల్లలను ప్రభుత్వ పాఠశాలలనుండి తరిమివేశారు. కేసు కోర్టుకు వెళ్ళింది. తన యిచ్ఛకు వ్యతిరేకంగా ఏ విద్యార్థినీ జండా వందనం చెయ్యమని బలవంతంచేసే అధికారం ఏ పాఠశాలాధికారులకూ లేదని కోర్టు తీర్పు చెప్పింది.*

"అమెరికా రాజ్యాంగ ఆకాశంలో ధ్రువతార అనేది ఏదన్నా వుంటే, ఎంత పెద్ద అధికారిగాని, రాజకీయాలు, దేశభక్తి, మతము మొదలైన అంశాలలో ఏది సరియైన అభిప్రాయము, ఏది సరియైనది కాదు అన్నది మనతరఫున నిర్ణయించి, ఏతదభిప్రాయమే మంచిదని - చేతలతోను మాటలతోనూ ప్రజాబాహుళ్యం అంగీకరించేటట్లు బలవంతం చెయ్యలేకపోవడమే."

అన్నది న్యాయస్థానం తన తీర్పులో.

దురదృష్టవశాత్తూ, ఈ 'ధ్రువతార' యెడ మన దృష్టి మందగించింది. గత యిరవై సంవత్సరాలుగా, ప్రజల నమ్మకాలలోకి, వారి అభిప్రాయాల దొంతరలోకి తరిచి తరిచి చూచి, అధికసంఖ్యాకవర్గంతో పూర్తిగా ఏకీభవించని ఊహలు కలవాని

* Board of Education V Barnette, 319, U.S. 624.

మీద ఆంక్షలు విధించే దురలవాటు ప్రబలుతోంది.

**విధేయతా ప్రణాళికలు :**

ప్రభుత్వోద్యోగులు ఆ ఉద్యోగాలను ఆశించే వారి యెడల, రాజకీయ మత సంబంధమైన సంఘాల సభ్యత్వాలను గురించి కాని, ఈ విషయాలలో వారి అభిప్రాయాలను గురించి కాని ఏవిధమైన దర్యాప్తులూ చేయరాదని అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వం ఉద్దేశించింది.

కాని 1939 లో ఉద్యోగస్థులూ, ఉద్యోగాలు కావాలని ఆశపడేవారూ ప్రభుత్వ విధ్వంసం ధ్యేయంగా గల సంస్థ దేని లోనూ తనకు సభ్యత్వం లేదని స్పష్టీకరించాలని నిర్దేశించింది ప్రభుత్వం. దీనితో కేంద్ర ప్రభుత్వోద్యోగులయొక్క దేశ భక్తి తత్పరత, దాని లోతుపాతులూ పరిశీలించడానికి విస్తృత మైన క్రమపద్ధతులు తయారయాయి. రక్షణశాఖలో గుత్తకు పనులుచేసేవారికీ, వారివద్ద పనిచేసేవారికీ రక్షణ శాఖకూడా ఇదేవిధమైన క్రమపద్ధతులు కొన్ని జారీ చేసింది. ఈ కంట్రా క్టర్ల లిస్టులో పెద్దపెద్ద కంపెనీలలో చాలాభాగం, చిన్న చిన్న కంపెనీలలో డజన్లకొద్దీ కంపెనీలూ ఉన్నాయి. పోతే, రాష్ట్ర ప్రభుత్వాలు, పాఠశాలాధికారులు, ఉద్యోగాలిచ్చే ఇతర సంస్థలూ యిటువంటి పద్ధతుల్నే అవలంబించాయి. ఎటార్నీ జెనరలు* ఒక లిస్టు తయారుచేశాడు. అందులో రెండువందల సంస్థల పేళ్ళున్నాయి. వీటిలో సభ్యత్వం దేశారిష్టదాయకం అని పరిగ ణింప బడింది.

విధ్వంసదారుల బారినుండి రక్షించుకునే హక్కు ప్రతి ప్రభుత్వానికీ ఉన్న మాటలో ఏ సందేహమూ లేదు. పనివారిని

---

* Attorney General of the United States.

మంచివారినిగా చూసి ఏరుకొనే అధికారం ప్రభుత్వానికి ఉండనే వుంది. ఉన్నతాధికారుల హోదాలకు తమ అభిప్రాయాలపట్ల సానుభూతి కలిగి, వాటిని సక్రమంగా నిర్వహించే సమర్థతగల మనుష్యులేన్నే ప్రభుత్వం ఏరుకోవలసిన మాటకూడా సత్యమే. అయినా, దేశంయెడ విధేయతను నిరూపించే ఉద్దేశ్యంతో మొదలైన కార్యక్రమాలవల్ల మాత్రం వ్యక్తిస్వాతంత్ర్యానికి చాలా బలమైన దెబ్బ తగిలింది. ఇంగ్లండులో చేసినట్లు, మనవారు అనుమానించిన వ్యక్తుల్ని ముఖ్యమైన ఉద్యోగాల నుండి తప్పించి అంత ప్రాముఖ్యం కానిచోట్లకు మార్చలేదు. ఎవరు దేశభక్తులు, ఎవరు కారు అన్న విషయం నిర్ణయించడానికి విచారణలు, కోర్టులోవలె 'హియరింగులు' ప్రారంభించారు. దీని ఫలితాలు చాలా విషమం అయాయి.

దేశభక్తుడు కాడన్న మిషతో ఉద్యోగం ఇవ్వకపోవడం, చేస్తూ చేస్తూఉన్న నౌఖరీలోంచి తీసివేయడంవల్ల కలిగే ఫలితాలు ఆ మందభాగ్యుడి ఉపాధి పోవడంతో ఆగవు. నమ్మదగినవాడు కాడని, శాశ్వతంగా ప్రభుత్వోద్యోగాలకు అనర్హుడని యీ అభాగ్యుడి పరువుప్రతిష్ఠలు పూర్తిగా నాశనం అవుతాయి. 1952 లో సుప్రీంకోర్టు చెప్పినట్లు, ఈ 'దేశభక్తి' నేరంక్రింద ఉద్యోగాన్నుంచి బర్తరపు కావడం వ్యక్తి నడవడిమీద మచ్చ వంటిది. * కోర్టువిచారణలో నిందితునికి యివ్వబడ్డ హక్కులు ఏవీ ఈ అభాగ్యుడికి యివ్వబడలేదు. 'దేశద్రోహి' అని తనను నిరసించిన వ్యక్తితో ముఖాముఖి సంఘర్షణకాని, కనీసం తనపై యీ నేరం మోపినవారి నామాక్షరాలు తెలుసుకునే అవకాశం కాని యీ నిందితునికి యీబడలేదు. బాధ్యతారహితంగా నేరాలు

* Wieman V Updegraff, 344, U.S. 183.

మోపే పద్ధతికి యీ పరిస్థితులు దారితీశాయి. నిందితుడైన అభాగ్యుడికి, తన నెత్తినపడ్డ యీ నేరాలు అసత్యాలని నిరూపించే అవకాశం మొదటినుండీ లేనేలేదు. మచ్చుకు ఒక కేసు: యూనియన్ కార్యాలలో ఏవో కొన్ని అంశాలపై తనకు వ్యతిరేకించిన ప్రతికక్షులు తనమీద యీ అభియోగం తెచ్చారని ఒక యూనియన్ అధికారి చెప్పింది. ఇది ఎంతవరకు సత్యమో, కేసు విచారించే బోర్డు కాని, విచారింపబడ్డ వ్యక్తి కాని కనుక్కోలేకపోయారు. ఆమెపై నేరారోపణ చేసిన మహానుభావులపేర్లు ఆమెకు కాని, ఆమెను విచారించే బోర్డుకు కాని తెలియనేలేదు.

మరో విషయం! 'ఒక వ్యక్తి నేరంచేశాడా, లేదా' అన్నది కాదు కేసులో విచారింపబడే అంశం. ముందు ముందు చెయ్యగలడేమో అన్న అనుమానం మాత్రమే విచారింపబడేది. అందుచేత విచారణ సాధారణంగా, వ్యక్తుల అభిప్రాయాలూ, ఉద్దేశ్యాలూ, దృక్పథాలచుట్టూ తిరిగేది. ఈదారిని ఎంతదూరం ప్రయాణంచేశారు అన్న ప్రశ్నకు సమాధానం విచారణజరిపే బోర్డు సభ్యులు, లేక తదితర అధికారుల నిగ్రహశక్తిపై ఆధారపడివుండేది. కొంతమంది, "అపాయకరమైన అభిప్రాయాలు" వ్యక్తీకరించినందుకు తీవ్రంగా శిక్షించేవారు. ఒక్కొక్కప్పుడు, ప్రభుత్వంతో సంబంధంగల ఉద్యోగప్రదాతలు, మరేవిధంగానూ వొదుల్చుకోలేని ఉద్యోగుల్ని ఈ దేశద్రోహమిష ఆధారంగా బైటికి పంపించేవారు. ఈ కేసుల్లో చాలా భాగం కోర్టుల పొలిమేరకు కూడా వచ్చేవి కావు. ఉపాధి కోల్పోయిన అభాగ్యశేఖరులకు, అంత పట్టుదలకాని, బహుకాలం కోర్టుల చుట్టూ తిరిగే ఓపిక, ఆర్థికస్తోమతకాని ఉండేవి కావు. ఏతావాతా కేసులు తమ

దారా వచ్చినప్పుడు యీ విచారణలు జరిపే సంస్థలమీద కొద్దో గొప్పో ఆంక్షలు విధించేవి న్యాయస్థానాలు. ఫలితం గతకాలంలో ఎప్పుడో తాను దేశవిద్రోహుల స్నేహం చేసిన పాపానికి ఏవ్యక్తీ నౌకరీనుండి బర్తరఫు కారాదు.

మూడోది :

ఈపద్ధతి ఫలితంగా ప్రభుత్వోద్యోగులలో సొంతంగా ఆలోచించే శక్తి గలవారు సంప్రదాయానికి కించిత్తు వ్యతిరేక మైన భావాలు వారి మనసుల్లో ఉన్నా బైటపెట్టడానికి వెనుకాడే వారు. సర్కారు నౌకరీలో లేకపోతే ప్రవేశించడానికి సందేహించే వారు. ఒకానొక విదేశాంగశాఖోద్యోగి అన్నట్టు: బుద్ధిలేని, మధ్యరకం తెలివితక్కువ జాతే ఆదర్శం అయినట్లు ఉండేది పరిస్థితి. ప్రభుత్వోద్యోగుల ఉపజ్ఞతో కూడిన స్వతంత్ర ఆలో చనా శక్తులమీద పడ్డ యీ చన్నీటివర్షం అమెరికాజాతి పటిష్ఠతకు పెద్ద దెబ్బకాగలదు.

దేశభక్తి నిరూపకకార్యక్రమాల అభివృద్ధితో వివిధ స్థానాలకు ఎన్నోరకాల ప్రతిజ్ఞలు అమలులోకి వచ్చాయి. ఈ ప్రతిజ్ఞలు తీసుకోడానికి వెనుకాడిన వారికి ఉద్యోగాలూ, వృత్తులూ నిరాకరింపబడ్డాయి. అటువంటి వారికి న్యాయవాది, డాక్టరు, డ్రెయినేజి కంట్రాక్టరు, చెత్తవర్తకుడు మొదలైన పనులకు, వృత్తులకు అర్హత లేదు; ప్రభుత్వం కట్టిన యిళ్లలో వారికి స్థానంలేదు; మాజీసైనికుల ఉపకారవేతనాలకు హక్కు లేదు; పన్నులనుండి మినహాయింపులేదు; నిరుద్యోగభీమాలేదు; మరేవిధమైన సహాయమూ లేదు.

నిజమైన విద్రోహుల్ని ఈప్రతిజ్ఞలు పట్టుకోగలవు

అనేది సందేహమే. 'శత్రురాజ్యాలకు సహాయంచెయ్యాలి' అని దీక్షాకంకణం కట్టుకున్న ఒక మహానుభావునికి, ఒక అబద్ధ ప్రమాణం చెయ్యడానికి జంకు ఎందుకు రావాలి? ఆచార్యాలు చెయ్యదలుచుకున్నవాడు అసత్య ప్రమాణాలు చెయ్యడానికి వెరవడు; అసత్యం చెప్పిన దోషానికి శిక్ష అనుభవించడానికి కూడా సిద్ధం అయేవుంటాడన్నది చరిత్రప్రసిద్ధమైన విషయం. ఆత్మశుద్ధి గల సత్యశాలే యిటువంటి విషయాల్లో అబద్ధాలాడ డానికి వెనుకాడేది. 'ఈ దేశభక్తి ప్రమాణాలు అబద్ధాలకోర్లకు ఆటపట్టు' అని బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఏనాడో అన్నాడు.

తన ఉద్యోగుల అవకతవకలనుండి తనను తాను రక్షించుకొనే హక్కు ప్రభుత్వానికి ఉంది. ప్రతి ఉద్యోగీ రాజ్యాంగాన్ని బలపరుస్తాననీ, దానిని సర్వకాలాలలోను రక్షిస్తా ననీ ప్రతిజ్ఞ తీసుకుంటాడు. అసలు వారు పనిచేసేదే రాజ్యాంగ చట్టంక్రింద! కాని దేశభక్తినిరూపక పద్ధతి యీప్రతిజ్ఞను ఏనాడో అధిగమించింది. అతను చేసే పనికి, అతని తలమీద ఉంచిన జవాబుదారీకి ఎంతమాత్రం అవసరంలేని ప్రతిజ్ఞా భారాన్ని ఉద్యోగుల నెత్తిన మోపుతున్నారు. కాలిఫోర్నియా చట్టంప్రకారం 'అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వాన్ని హింసాత్మకచర్యల సహాయంతో అధిగమించను' అని ప్రమా ణంచెయ్యని వా రెవ్వరికీ పన్నులనుండి మినహాయింపు లభిం చదు. ఇది చక్కని ఉదాహరణ. బలవంతంగా ప్రతిజ్ఞను చెయ్యడం తమ సిద్ధాంతాలకు వ్యతిరేకం అన్న కారణంగా చర్చి అధికారులూ, తదితరులూ ఈచట్టానికి అభ్యంతరపెట్టారు. చివరికి సుప్రీంకోర్టు ఈచట్టాన్ని రాజ్యాంగచట్టానికి విరుద్ధం అనీ,

ప్రజల అభిప్రాయాలూ, నమ్మకాలమీద అవసరంలేని ఆంక్ష అనీ నిర్ణయించింది*

గతకాలంలో తన అభిప్రాయాల ఫలితంగా, తరుచు ప్రస్తుతకాలంలో ఆంక్షలూ అడ్డంకులూ తగిలించడం ఈ దేశభక్తినిరూపక ప్రణాళికలలోని మరివొక దుర్గుణం. అంతర్యుద్ధం తరువాత తా మెప్పుడూ దక్షిణరాష్ట్రాల సేనాసమూహాన్ని బలపరచలేదని ఉద్యోగులు ప్రమాణం చేయవలసివచ్చేది. ఇది గడచిపోయిన విషయాల నాధారంచేసుకుని శిక్షించడం క్రిందికి వస్తుందని, అందుచే రాజ్యాంగచట్టానికి వ్యతిరేకం అని నిర్ణయింపబడ్డది.† అయినప్పటికీ సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వాన్ని చట్టవిరుద్ధం అయిన పద్ధతిలో నిర్జించే ఉద్దేశం గల ఏసంస్థలోనూ తనకు గతంలో సభ్యత్వం లేదనే ప్రమాణం వ్యక్తులు తీసుకోవాలన్న విషయం యీనడుమ మళ్ళీ మొదలైంది.

## శాసనసభలు చేసే విచారణలు

దేశభక్తి కార్యక్రమానికి ప్రమాణస్వీకారం మొదలైన వాటితో చాలా సన్నిహితం అయిన సంబంధంకలవి 'దేశవిద్రోహచర్యలు' 'అమెరికా వ్యతిరేక కార్యాల'పట్ల శాసనసభలు జరిపే విచారణలు. ప్రభుత్వోద్యోగులు ఉద్యోగేతరులయొక్క నమ్మకాలు, ప్రకటనలు, సంబంధబాంధవ్యాలు మొదలైన వాటిపట్ల పూర్తిదర్యాప్తు చెయ్యబడింది. విచారణ జరిపేవారితో ఏకీభవించని అభిప్రాయాలుగలవారు ఏవిధంగా విపరీత ప్రచారం

---

*Speiser V Randall. 357, U.S. 513.

† Cummings V Missouri 4 Wall, 277.

వల్ల శిక్షించబడ్డారో బార్త్, టేలర్లు* తమ గ్రంథాలలో విపులీకరించారు. ఒక్కొక్కప్పుడు సాక్షులతో, "ఇది ప్రజాభిప్రాయ న్యాయస్థానం. మీరు దేశంలో ఉత్తమోత్తమమైన న్యాయస్థానం ముందు నిలబడ్డారు." అనేవారు యీవిచారణాసమితి సభ్యులు.† ఇవి అసదగిన మాటలు కావు.

ఒక్కొక్కప్పుడు విచారణలు న్యాయదూరమైన పద్ధతిలో నడిచేవి. బాధ్యతారహితంగా వ్యక్తులపై మోపబడ్డ అభియోగానికి విరివిగా ప్రచారం కలిగించడం, అట్టి అభియోగం మోపినవారితో ముఖాముఖి మాట్లాడే అవకాశం లేదు సరిగదా, తమనుగూర్చి చెప్పబడిన హక్కులు అసత్యాలని ప్రచురించడానికి సరియైన అవకాశాలుకూడా లేకపోవడం తరుచు జరుగుతుండేది. అప్పుడప్పుడు సభలో లేని వ్యక్తులెవరితోనో, తమకుగల సంబంధాలు చర్చించమని సాక్షుల్ని బలవంత పరిచేవారు. ఈ విధంగా నేరం నెత్తినపడ్డవారికి - పరోక్షంలో జరగటంచేత - తమ ప్రవర్తనను ఈ ఆఘాతాలనుండి రక్షించుకునే అవకాశం ఎంతమాత్రమూ వుండేదికాదు. ఇటువంటి సందర్భాలలో సాక్షికి రెండుమార్గా లుండేవి. ఒకటి: జవాబు చెప్పి, తనను, తన స్నేహితులను వ్యతిరేకప్రచారానికి గురి అయ్యేటట్లు చెయ్యడమేకాకుండా ఉత్తరోత్తరా అబద్ధసాక్ష్యం చెప్పినందుకు న్యాయస్థానంలో నిలబడి సమాధానం చెప్పవలసిన అగత్యం తమ నెత్తిమీదికి తెచ్చుకోవడం. రెండవ మార్గం: 'మీ రడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పను' అని నిరాకరించి, అవిధేయతానేరానికి శిక్ష తన నెత్తినవేసుకోడం.

---

* Barth : Government By Investigation
Taylor : Grand Inquest.

† Watkins V United States. 354 U.S. 178, 200.

చేయబడ్డ శాసనాలు సరిగా అమలు జరుగుతున్నాయా అన్న విషయం పరిశీలించడానికిగాని, కొత్త శాసనాలు చేయవలసిన ఆవశ్యకత ఎంతవరకూ ఉన్నదో తెలుసుకోడానికి కాని శాసనసభలు విచారణ జరపడం న్యాయంమాత్రమే కాదు, అవసరం కూడానేమో. కాని విచారణ ప్రజల వ్యక్తిగత భావాలూ, నమ్మకాలలోకి తొంగిచూచి వారి వ్యక్తిగత జీవితాలకు చాటన్నది లేకుండా చెయ్యడం మాత్రం ఎంతమాత్రం భావ్యంకాదు. అట్టి సందర్భాలలో సరిగా బదులుచెప్పక అవిధేయతా నేరానికి గురిఅయిన అభాగ్యుల్ని జైలుపాలు కాకుండా రక్షించడం న్యాయస్థానాల విధి. కాని యీ సందర్భాలలో కోర్టు వారు పూర్తిగా నమ్మదగిన సంరక్షకులుమాత్రం కాదు. అప్‌హౌసనే ఒకానొక పెద్దమనిషి, సమావేశాలలో తనతో పాల్గొన్న వ్యక్తుల పేర్లను చెప్పనుగాక చెప్పనని నిరాకరించి 1959 లో న్యూ హాంప్‌షైర్‌లో జైలుకు వెళ్ళాడు. ఇంతకూ ఆ అభాగ్యుడు నేరస్థుడు కాడు సరిగదా, మిక్కిలి దైవభీతి కలవాడు. దేవతార్చన చేసే సరుకు! తన నీతినియమాలకు వ్యతిరేకం అని చెప్పలేదు. అంతే కారణం. తను ఎవరితో ఏమి మాట్లాడాడో తెలుసుకోవలసిన ఆవశ్యకత ప్రభుత్వానికి లేదని అతని నిశ్చితాభిప్రాయం.

తన అభిప్రాయాలు, తన నమ్మకాలు, తనకు గల స్నేహసంబంధాల ఫలితంగా, సాక్షి, నిరసనకు, శత్రుత్వానికి గురికావడం భావస్వాతంత్ర్య వాక్స్వాతంత్ర్యాల క్లుప్తీకరణకు ఒక రూపం. ఈ విచారణ ఆబాధనుండి తప్పించుకోడానికి ఎంతో సనాతనమైన భావాలు కలిగివుండి అటువంటి ఊహలనే నోట పలికే పద్ధతికి అమితమైన ప్రోత్సాహం లభించింది. విచారణ

సంఘాల చర్యలకు న్యాయస్థానాలు కొద్దో గొప్పో హద్దులు విధించిన మాట నిజమే. విచారణ సంఘంయొక్క అధికారం స్పష్టంగా లేక, వేయబడిన ప్రశ్నకు, జరిగే విచారణకు సరియైన సంబంధం ఉన్నదా అన్న విషయం సాక్షికి సందేహాస్పదం అయితే, సరియైన సమాధానం చెప్పక సాక్షి విచారణసంఘాన్ని నిరసించిన నేరానికి కోర్టులు శిక్షించడం మానివేశాయి.* కించిత్తు అతిశయోక్తితో ఉత్ప్రేక్షిస్తే, కమ్యూనిస్టుల చర్యలు ఎంతవరకూ దేశద్రోహకరం అయాయో పరిశీలించే కమిటీ సమక్షంలో వాతావరణాన్ని గురించిన ప్రశ్నలకు సమాధానాలియ్యని సాక్షి కమిటీని నిరసించినట్టు కాదు. న్యాయస్థానాలు ఏదో కొంత రక్షణ యిచ్చినా, శాసనసభయొక్క సంయమన, ప్రజాభిప్రాయం యొక్క బలం మాత్రమే సభ్యుల విపరీత ఉద్రేకోత్సాహాలకు సరియైన అనకట్టలు కాగలవు.

## తరతమభేదాలతో కూడిన

## ప్రభుత్వదృక్పథాన్నుండి రక్షణ:

న్యాయశాస్త్ర దృష్టిలో సమానత్వంయొక్క ఆదర్శాన్ని లాక్ మహాశయుడు† చక్కగా నిర్వచించాడు: "ధనవంతునికి ధనహీనునికి, రాజసఖుడికి పేదరైతుకి ఒకేన్యాయం వుండాలి. ప్రత్యేకవ్యక్తుల పట్ల న్యాయం మారరాదు. అందరిమీదా సమానమైన చట్టాల సహాయంతో న్యాయపరిపాలన జరగాలి." కాని, అందలం ఎక్కేవారూ, అందలం మోసేవారూ అనాదినుండి ఉండనేవున్నారు. ఏథెన్సు నగరంలో పేరెన్నికగన్న ప్రజా

---

* Watkins V United States 354 U S. 178

† Treatise on Civil Government, 1690.

స్వామ్యంమాత్రం బానిసత్వంయొక్క ఘనభుజస్కంధాలపై ఆధారపడి మరీ నడిచేది. మధ్యకాలంలో, బానిసకు సమీపస్థుడైన వ్యవసాయకూలీకి, శ్రీమంతుడైన జమీందారుకు, చట్టదత్తమైన హక్కుల విషయంలో నక్కకూ దేవలోకానికీ ఉన్నంత తేడా. ఇండియాలో, కొంతకాలంక్రితంవరకు, నిర్ణీతమైన హక్కులు, కర్మలు కల వర్ణాశ్రమపద్ధతి ప్రబలివుండేది. ''మాదిమాత్రం వర్గాలు లేని సంఘం'' అని ఎన్ని ప్రగల్భాలు పలికినా, సోవియటు రష్యాలో పార్టీసభ్యులు, ఉన్నతోద్యోగులు మొదలైనవారికి కొత్త అల్లుళ్ళకువంటి సన్మానాలు, సమారాధనలు లభిస్తాయి.

దక్షిణాఫ్రికా యూనియను, హిట్లరు పాలనలో జర్మనీ దేశాలలోవలె ఒక్కొక్కసారి యీ వర్గీకరణ జాతిభేదాల్నిబట్టి జరగవచ్చు. అమెరికా దేశంలోకూడా యిట్టి తరతమ భేదాలున్నాయి. ఒక ప్రాంతంలో అమెరికా చరిత్ర మొదటి శతాబ్దం అంతా యించుమించుగా, బానిసలను కొనుక్కునే పద్ధతి పూర్తిగా అమలులో వుండేది. బానిసలు ఆస్తిక్రింద జమ అవుతారు కాని పౌరులు కాజాలరని, అందుచే బానిసత్వాన్ని ఏ ప్రాంతంలోనూ నిషేధించే హక్కు కాంగ్రెసుకు లేదని, డ్రెడ్ స్కాటు కేసులో న్యాయస్థానం నిర్ణయించింది. ఈ అన్యాయాన్ని నాశనంచేసే ఉద్దేశంతో అంతర్యుద్ధం ముగిసినవెంటనే పదమూడు, పధ్నాలుగు, పదిహేనవ సవరణలు అవతరించాయి. నీగ్రోలకు మాత్రమే కాక, చైనీయులకు, మెక్సికనులకు, రెడ్ ఇండియనులు మొదలుగాగల సర్వజాతులవారికి బానిసత్వం, నిర్బంధసేవా పూర్తిగా రద్దు చేసింది పదమూడవ సవరణ. పధ్నాలుగవ సవరణ అమెరికా సంయుక్త రాష్ట్రాలలో పుట్టి, లేక

అక్కడ స్థిరపడిన వారందరికి - మాజీ బానిసలతో సహా - సమానపౌరసత్వ హక్కులు యివ్వడమే కాకుండా, 'తన అధికార పరిధిలో రాష్ట్రాలు, చట్టదృష్టిలో సంపూర్ణ సమానత్వాన్ని ఏవ్యక్తికీ నిరాకరించరా'దని శాసించింది. జాతి, రంగు, మాజీ బానిసత్వాలు కారణాలుగా వోటింగుహక్కు నిరాకరించడం కాని, క్లుప్తీకరించడం కాని రాష్ట్రప్రభుత్వం, అమెరికా సంయుక్త రాష్ట్రాల కేంద్రప్రభుత్వం రెండూకూడా చేయరాదని పదిహేనవ సవరణ శాసించింది.

ఈ సవరణలోని ముఖ్యోద్దేశం 1896 లో న్యాయాధిపతి హార్లాన్ వివరించాడు :

"అమెరికా రాజ్యాంగచట్టం ప్రకారం - చట్టదృష్టిలో - అధికారం చలాయించే ఎక్కువ తరగతిపౌరులు ఈ దేశంలో లేరు. ఇక్కడ వర్ణభేదాలు లేవు. అమెరికా రాజ్యాంగం వర్ణవిభేదాలను గుర్తించదు. పౌరులలో విభాగాలు దానికి తెలియవు. తెలిసినా సహించదు. మానవుని మానవునిగా చూస్తుంది అమెరికా న్యాయం. ఉన్నతాతి ఉన్నతమైన చట్టం ప్రసాదించిన పౌరహక్కులు, చిక్కులోపడ్డప్పుడు, ఆ అభాగ్యుని వర్ణాన్ని, ఆ మనిషి నివసించే పరిసరాలను గుర్తించదు...."

అయితే, ప్లెసీకేసులో * శ్వేతజాతులకు, తదితరులకు వేర్వేరు సౌకర్యాలు కల్పించే హక్కును ప్రభుత్వానికి ప్రసాదిస్తూ సుప్రీంకోర్టు చేసిన మెజారిటీ తీర్పుతో తన అసమ్మతిని వెలిబుచ్చుతూ హార్లాన్ చెప్పిన మాటలవి. అప్పటి ఈ అసమ్మతి యిప్పుడిప్పుడు సంపూర్ణన్యాయంగా పరిగణింపబడుతోంది. †

---

* Plessy V Ferguson, 163 U.S. 537.

‡ Brown V The Board of Education 347 U.S. 483.

బానిసత్వబంధాలు దాటి, తదితర అమెరికను లందరివలె, సమానమైన హక్కులు పొందాలని, నీగ్రోలు మిక్కిలి శ్రమ కోర్చి సుదీర్ఘమైన పోరాటం సాగించారు. కోర్టులముందు వందల కొలది కేసు లీసందర్భంలో వచ్చాయి. నీగ్రోలకు వోటింగు హక్కు వుందని, వారు జ్యూరీలలో సభ్యులుగా ఉండవచ్చని, నీగ్రోలుకూడా ఉన్న మిశ్రమ జ్యూరీల సమక్షంలో తమ వివాదాలను పరిష్కరించుకోవచ్చునని, తదితరులతోపాటు తాము కూడా రైళ్ళను, బస్సులను, విమానాలను, ప్రభుత్వం ఏర్పరిచిన ఉద్యానవనాలను, ఈతలాడే సరస్సులను ఉపయోగించవచ్చని, తెల్లజాతులు, పచ్చజాతులు, తదితరుల వలె తాము కూడా ఈ హక్కులను, ఈ సౌకర్యాలను పొందగలమని నీగ్రోలు నిరూపించడానికి వేలాది ప్రజలు తమ సమయము, ధనం వెచ్చించి, ప్రజల కోపాలకు కూడా గురి అవడానికి సిద్ధపడ్డారు. ఇంకా చేయవలసినది చాలా ఉన్న మాట వాస్తవమే. కాని పధ్నాలుగు పదిహేనవ సవరణలలో ప్రకటింపబడిన ధ్యేయానికి-వర్గాన్ని కించిత్తూ లక్ష్యపెట్టకుండా, న్యాయదృష్టిలో, మానవుని మానవునిగా మాత్రం గణించే పరమధ్యేయానికి— ఈనాడు అమెరికన్లు యిదివర కెన్నడూ లేనంత చేరువ అయిన మాటకూడా వాస్తవమే.

ఈ వ్యత్యాసభావాలు నీగ్రోలకు మాత్రమే పరిమితం కాలేదు. ప్రాచ్యజాతులయెడ చూపబడిన వ్యత్యాసభావాలు ఇంకా గర్హనీయాలు. ఈ సందర్భాలలో బైటపడ్డ రాజ్యాంగ సమస్యలు మరింత క్లిష్టాలు. ఆదిలో, ఒకకేసులో శాన్‌ఫ్రాన్సిస్కోలో చైనీయులకు లాండ్రీలు నడపడానికి అనుమతి నిరాక

రించిన అధికారుల చర్య సరియైనది కాదని నిర్ణయింపబడింది.*

ఈ సడుమ జపానీయులను చేపలు పట్టే హక్కు నిరాకరించిన కాలిఫోర్నియా చట్టం అసంగత ప్రసంగంగా ప్రకటింపబడింది.†

మొన్న రెండవ యుద్ధకాలంలో లక్ష పైచిలుకు జపానీయులను-ఇందులో ఎంతోమంది సంపూర్ణ పౌరహక్కులు పొందినవారు-కోస్తాప్రాంతాలనుండి తప్పించి దేశాంతర్భాగంలోని తాత్కాలిక ఆశ్రయస్థానాలకు తీసుకొనిపోయారు అధికారులు. తత్ఫలితంగా చాలామంది జీవితం అంతా శ్రమించి నిర్మించుకున్న వ్యాపారాలను, ఆస్తిపాస్తులను అమ్ముకోవలసి వచ్చింది. రాజ్యాంగహక్కులు నిర్జింపబడ్డాయా అన్న ప్రశ్న కూడా చాలామందికి కలిగింది. నిర్జింపబడ్డాయి అన్నారు కొందరు. ఈ కార్యావళి చాలా కష్టాలు కలిగించినా కోర్టువారు దీనిని ఖండించలేదు. పెర్ల్‌హార్బరు తరువాత దేశపరిస్థితులు క్లిష్టం అయిన కారణంగానూ, పశ్చిమతీరాన్ని జపానువారు తమ సేనలను దింపే అవకాశం పూర్తిగా ఉన్నది అన్న సైనికాధికారుల సహేతుకమయిన భయంచేతను తాము ఈ అభిప్రాయానికి వచ్చినామని కోర్టువారు స్పష్టంచేశారు. జపానువారు సైన్యాన్నే దింపివుంటే, రాకీపర్వతాల పశ్చిమప్రాంతంలో ఆనాటి అమెరికన్ల ప్రతిఘటనాశక్తి శూన్యం అన్నమాట కూడా వాస్తవమే. ఈ అసాధారణపరిస్థితులను తప్పిస్తే, పూర్వీకుల నాధారం చేసే వ్యత్యాసభావాలు ప్రవర్తించే పద్ధతికి అనుకూలంగా వాదించే మనిషే దొరకడు! కోర్టువారుకూడా, పశ్చిమతీరాన్నుంచి జపానీయులను దూరంచేసినమీదట, సాక్షాత్తూ విద్రోహకార్యాలు

* Yick WO V Hopkins 118 U.S. 356.

† Takahashi V Fish Comm'n, 334 U.S. 410.

చేస్తే తప్ప, వారిని నిర్బంధంలో పెట్టడానికి వీలులేదని నిష్కర్షగా చెప్పారు.*

"దేశభక్తుడు" అని నిర్ణయింపబడ్డ వ్యక్తి, విద్రోహ కార్యాలు చేసే వాడన్న అనుమానంకాని, శత్రువుల తరపున గూఢచారిగా పనిచేస్తాడనే ప్రశ్నకాని రావలసిన అవసరంలేదు. 'దేశం పట్ల విధేయత' అనేది వ్యక్తుల హృదయాలు, మనస్తత్వాలు అన్నవాటిపై ఆధారపడివుంటుంది. 'విధేయుడు' అంటేనే విదేశీయ గూఢచారి కాడని, విద్రోహి కాడని నిర్వచనం. యుద్ధ కార్యక్రమాలను విద్రోహాత్మకచర్యలనుండి రక్షించే అధికారం నుండి తత్సంబంధమైన నేరాలు చేసిన ప్రజలను నిర్బంధించే అధికారం జనించింది. అందుచేత, ఈ ధ్యేయంతో ఎంత మాత్రం సంబంధం లేని నిర్బంధం ధర్మవిరుద్ధం.

జాతి, వర్ణం, అనువంశము† మొదలైన అంశాలు ఆధారంగా, తరతమ భేదాత్మకమైన చర్యలు, ఏ ప్రభుత్వశాఖ గాని చెయ్యకపోతే—ఈ భేదాత్మక చర్యలను వారు ఎంత చక్కని భాషలో సమర్థించినా సరే — భావిలో, మనజాతి సగర్వంగా తలయెత్తుకుని తిరుగగలదు.‡

---

* Ex Parte Endo; 323 U.S. 283.

† Hereditary, వంశమునకు సంబంధించినది.

‡ ప్రభుత్వపరంగా జరిగే భేదాత్మక చర్యలనుగూర్చి మాత్రమే మనం ప్రస్తావించేది. ఉద్యోగాల విషయంలో ఈ తేడాలు చూపించడం చట్టవిరుద్ధంగా కొన్ని రాష్ట్రాలు ప్రకటించాయి. న్యూయార్కు చట్టం అనేకకేసులలో బలపరచబడింది. (Matter of Holland V Edwards, 307 N.Y. 38: Castle Beach Club V Arbury 2 N. Y. 2d 597; American Jewish Congress V. Carter, 190 N.Y.S. 2d 218.

జాతినిబట్టి ఏ వ్యక్తికీ ఫలహారగృహాలలో తినుబండారాలను నిరాకరించరాదనే కొలంబియాశాసనాన్ని బలపరచిన కేసు; District of Columbia V Thompson & Co, 346 U.S. 100.

తరతమాత్మకమైన దృష్టినుండి, నిజానికి, ఏవర్గమూ తప్పించుకోలేదు. కొద్దో గొప్పో తెలుపు తక్కువ వర్ణంవారం దరియెడ—నీగ్రోలు, ప్రాచ్యులు, ఇటాలియనులు, మెక్సికనులు, ఇండియనులు మొదలైనవా రందరూ—వ్యతిరేకభావం అణగి ఉండి న్యాయదృష్టిలో గర్హనీయమైన భేదభావాలు మొలకెత్త వచ్చు. ప్రపంచంలో అనేకజాతులవారి చర్మాలు పసుపు, గోధుమ, లేక నలుపువర్ణాలు కలిగినవిగా ఉంటాయి. శ్వేతజాతులు అనేకచోట్ల అల్పసంఖ్యాకులుగా కూడ ఉండవచ్చు. అమెరికా సంయుక్తరాష్ట్రాలలోకూడ, శ్వేతముఖులైనా, యూదులు, కాథలిక్కులు, మోర్మనులు, యెహోవాసాక్షులు జర్మను యిటాలియను ఐరిష్‌స్లావు జాతులయెడ వ్యతిరేకభావాలు తీవ్రంగా ప్రబలివున్నాయి. జాతిమత కులాల ఫలితంగా ఏవర్గంయెడల అయినా ప్రభుత్వం భేదభావం ప్రకటించడం అమెరికన్లు సహించారా, మరోవర్గం మరోవర్గంకూడా యీ అంటువ్యాధికి గురి అయేమాట తథ్యం. అందుచేత రాజ్యాంగ చట్టదత్తమైన సమత్వం - చట్టదత్తమైన సంపూర్ణ సమానత్వం - అమెరికన్లు అందరియెడా అమలుజరిగేటట్టు చూడడమే అమెరికన్లకు కర్త్రీ లేని రక్షణ.

## పౌర అధికారం :

మతంయొక్కగాని, సైన్యాధికారం యొక్కగాని ప్రభావానికి యెంతమాత్రం లోబడని రాజ్యాధికారం అమెరికన్ ప్రభుత్వాలు చలాయించడం అమెరికన్లకు గొప్పరక్షణ.

## మతం వేరు, రాజ్యం వేరు :

మతాన్ని, రాజ్యాధికారాన్ని మిళాయించరాదని అమెరి

కణ రాజ్యాంగం నిష్కర్షగా శాసించింది. "మత సంబంధమైన సంస్థలను గురించి కాని, అట్టి సంస్థలను నిరాటంకంగా నడుపు పనే పద్ధతిని రద్దుచేస్తూకాని" ఏ చట్టమూ అమలుకురాదని అమెరికా రాజ్యాంగ చట్టం శాసించనే శాసించింది. ప్రభుత్వోద్యోగాలకు అర్హతలుగా మత సంబంధమైన పరీక్షలుకూడా నిషేధమే. ఈ సిద్ధాంతాలవల్ల స్పష్టం అయేవి నాలుగు అంశాలు.

ఒకటి :

తాను అవలంబించిన మతం ఫలితంగా, ప్రభుత్వోద్యోగాలకు-చిన్నవి కాని పెద్దవి కాని-అర్హత యే స్త్రీకాని, పురుషుడు కాని కోలుపోరు.

రెండు :

ప్రభుత్వం అన్నది అన్ని మతాలనూ సమానంగా చూడాలి. జనాదరణ పొందిన మతంయెడ యెక్కువ ఆదరంకాని, అంతగా జనాదరణ పొందని మతంయెడ తక్కువ ఆదరం కాని ప్రభుత్వం చూపించరాదు. మచ్చుకు : ఒకమతంపై పన్ను విధించి మరి ఒకదానిపై మానివేయరాదు.

మూడు :

'మతం' అన్న మాట అమెరికన్లకు పరిచితాలైనవాటికే కాక, హైందవం, బౌద్ధం, యిస్లామువంటి అన్నిరకాలైన నమ్మకాలకూ చెందుతుంది. నాస్తికులు, భౌతికవాదులు, తదితరులూ ఈ నిర్వచనం క్రిందికి వస్తారు.

నాలుగు :

ప్రభుత్వం యొక్క రాజ్యాధికారానికి, మతానికి నడుమ,

నిర్జించరాని గోడ నిర్మింపబడింది. ఈ అవధి, రాష్ట్రప్రభుత్వాల యెడ మాత్రమేకాక, కేంద్రప్రభుత్వాల యెడకూడా వర్తిసుంది. మత సంస్థలు, ప్రభుత్వం - ఈ రెండిటినడుమ పరస్పర సహకారం ఉండరాదని దీని ఉద్దేశం కాదు. నిర్బంధరహితమైన పద్ధతిలో బడిపిల్లలను మతవిజ్ఞానశిక్షాతరగతులకు ప్రభుత్వం పంపించి సహకరించవచ్చు.* తదితర విద్యాసంస్థలకువలెనే మత విజ్ఞాన శిక్షాసంస్థలకు కూడా రవాణాసౌకర్యాలు కల్పించి సహకరించవచ్చు.† చర్చిల వంటి సంస్థల ఆస్తులను పన్నుల బారి నుండి రక్షించవచ్చు. అంతేకాని ఫలానారకమైన ఆరాధనాపద్ధతుల్నే అవలంబించమని ప్రజలను ఆదేశించరాదు.‡ మతవిజ్ఞాన శిక్షా తరగతులకు హాజరు కమ్మని బలవంతం చెయ్యరాదు. అట్టి సంస్థలలో పనిచేసే ఉపాధ్యాయుల వేతనాలు ప్రభుత్వం యివ్వరాదు. మతసంస్థలకు వారి ఆదాయానికి మించిన వార్షికఖర్చులు ఖర్చీచెయ్యరాదు. వారికి ఆస్తులు, సొమ్ములు ఈరాదు.

మతాలయెడ ద్వేషంచేత యీ అంశాలు ఆ రాజ్యాంగ చట్టంలో ఇమిడింపబడి వుండలేదు. ప్రభుత్వం ఏదో ఒక ప్రత్యేకమైన నమ్మకాన్ని పెంపొందించడం, నిరసించడం రెండూ విడిచిపెట్టి, వాటి దారిని వాటిని పోనిస్తేనే, ఇతర అభిప్రాయాలూ ఊహలవలెనే మతపరమయిన నమ్మకాలుకూడా పెంపొందగల వనే బలిష్ఠమైన నమ్మకంయొక్క ఫలితంగా యీ అంశాలు అమెరికా రాజ్యాంగంలో రూపొందాయి. మతం, రాజ్యం-యీ రెంటి మిళాయింపువల్ల యూరపులోనేకాక అమెరి

* Zorach V Clauson 343, U.S. 306.

† Everson V Board of Education 330 U.S. 1.

‡ Mc Collum V Board of Education 333 U.S. 203.

కను వలస రాజ్యాలలోకూడా యెట్టి ఘోరాలు జరిగాయో అమె రికా రాజ్యాంగకర్తలకు తెలుసు. ఆకారణంగానే అమెరికా పరి పాలనాపద్ధతిలో యిట్టి సంఘర్షణలకు అవకాశం లేకుండా చెయ్య డానికి వారు ఉద్దేశించి రాజ్యాధికారాన్ని మతంయొక్క ప్రభా వానలంనుంచి రక్షించడానికి నిశ్చయించారు. ఏతత్కారణంగా, మతం అమెరికాలో కలుషం తగ్గి బలం హెచ్చడానికి అవకాశం కలిగింది. స్వశక్తిమీదనే మతం ఆధారపడాలి. ప్రభుత్వం యొక్క మైత్రికాని, శత్రుత్వంకాని దానికి లభించదు. ప్రభుత్వం విషయంలో యీ పద్ధతి చాలా ఉపకారి అయింది. చర్చిల పర స్పరకలహాలలో యిరుక్కునే దురవస్థ ప్రభుత్వానికి తప్పింది.

బాలనేరస్థుల సమస్యతోకాని, మతవిషయిక అజ్ఞానంతో కాని ముఖాముఖి పరిచయం కలిగిన పెద్ద మనుష్యులు కొందరు "ప్రభుత్వపాఠశాలల్లో భగవానుణ్ణి పునఃప్రతిష్ఠ చెయ్యడమే తర ణోపాయం" అంటారు. పాఠశాలల్లో మతవిజ్ఞాన శిక్షా తర గతులు నెలకొల్పడంద్వారా యీ కార్యం సిద్ధింపజేసుకుందామని వాళ్ళ ప్రయత్నం. ప్రభుత్వాధికారాన్నుండి మతాధికారం వేరు చేసే పద్ధతే అమెరికా చర్చి అధికారులలో అత్యధిక సంఖ్యాకు లకు ఇష్టం. ఈ సిద్ధాంతం సర్వజనామోదం పొందినదే అయినా, మతాధికారులు తమ అధికారాన్ని ప్రభుత్వంమీద రుద్దకుండా ప్రతితరంవాళ్ళూ పునఃపునః ప్రతిఘటించవలసి వచ్చేటట్టే కనబడుతూంది.

## సైనిక పరిపాలన :

పౌరాధికారాలపై సైనికాధికారం దాడిచేసే అవకాశం ప్రబలమైంది. అంతర్యుద్ధకాలం తప్పిస్తే పందొమ్మిదవ శతా

బ్బంలో, సైనికాధికారులకు సంఘంలో ప్రభావం ఏమంతగా ఉండేది కాదు. ప్రచ్ఛన్న యుద్ధంవల్ల, సర్వజనీన సైనిక శిక్షణతో, ప్రభుత్వవ్యయంలో సగపాలు పైచిలుకు సైనికశాఖలు మింగివేయడంతో, సైనికాధికారుల ప్రభావం బాగా పెరిగిందనే చెప్పాలి.

సైనికుల దబాయింపుబాధ అమెరికన్ల పూర్వీకులైన అమెరికను వలస రాజ్యాలవారికి, పాపం, బాగా తెలుసు. అసలు మూడవ జార్జిరాజుకు వ్యతిరేకంగా అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలో చేయబడ్డ ఆక్షేపణలు ముఖ్యంగా సైన్యానికి సంబంధించినవే. శాసనసభ అనుమతి లేనిదే సైన్యాలను ఉంచాడని, బ్రిటిషు సైనికులను అమెరికా వలస ప్రజల నెత్తిని బలవంతంగా రుద్ది, వారి భోజనవసతి సౌకర్యాలు ప్రజలనుండి బలవంతంగా వసూలు చేశాడని, యీ సైనికులు చేసిన దురాగతాలను న్యాయస్థానాలు విచారించకుండా, అక్రమ పద్ధతిలో వారికి రక్షణ యిచ్చాడని—యివీ మన పూర్వీకుల ఆక్షేపణలు. ఇవన్నీ, రెండు మూడు నాలుగు సవరణలలో ప్రతిబింబిస్తాయి.

సైన్యాధికారంపై పౌరశాఖల ఆధిక్యత నిలుపుకునే ఉపాయం 'హేబియస్ కార్పస్' అనే 'రిట్'.* తనమెడల అమలు జరుపబడే నిర్బంధం చట్టసమ్మతమవునా కాదా అన్న విషయం న్యాయస్థానం సమక్షంలో ప్రశ్నించే సాధనం యీ 'హేబియస్ కార్పస్'. ఎన్నో సందర్భాలలో-ముఖ్యంగా సైనికాధికారులు ప్రజలను బందిఖానాలో పెట్టే సందర్భాలలో - ఇవి ఎంతో ప్రయోజనకారి. సైనికాధికారుల అధికారపరిధిలో కూడా న్యాయస్థానాలు తమమాట చెల్లించుకోడానికి సాధనం యిది

* Writ of Habeas corpus.

వాక్కుచే. శత్రువులు దండెత్తివచ్చిన సమయంలో, తిరుగు బాటువంటి విపరీత సమయాల్లో, ప్రజాక్షేమానికి అవసరం అయినప్పుడుతప్ప, యీ హేబియసు కార్పసు రిట్ వేసే అధి కారం ప్రజలయెడ నిరాకరింపబడరాదని ఆ రాజ్యాంగ చట్టం లోనే వుంది.* సైన్యాధికారి ఒకవ్యక్తియెడ అమలుజరిపిన నిర్బంధం సక్రమం అయినదా, కాదా అన్నవిషయం ఆ దేశంలో సామాన్య న్యాయస్థానాలు నిర్ణయిస్తాయి. ఈ 'హేబియస్ కార్పస్ రిట్ అమలుజరుగరా' దని అంతర్యుద్ధ సమయాలవంటి అసాధారణ పరిస్థితుల్లో నిర్ణయింపబడ్డప్పుడు, ప్రజాక్షేమానికీ నిర్ణయం అవసరం అని న్యాయస్థానాలు గుర్తి స్తాయి.

ఈ సిద్ధాంతాలకు అగ్నిపరీక్ష అంతర్యుద్ధ సమయంలో జరిగింది. తమంత తాము కాని, నిర్బంధం ఫలితంగా కాని, సైన్యంలో చేరేవారికి అడ్డుతగిలేవారు, తిరుగుబాటుదారులకు కొద్దో గొప్పో సహాయం చేసేవారు-అందరూ దేశవిద్రోహ కార్యక్రమాలలో భాగస్వాములని నిర్ణయించి, వీరిని మిలిటరీ కోర్టుల చేతుల్లో శిక్షకు పాల్పడాలని నిర్ణయించాడు అబ్రహాం లింకన్. ఈ అకార్యాలన్నీ అదివరలో నేరాలని కాంగ్రెసు నిర్ణయించి, సివిలుకోర్టుల సమక్షంలో విచారణ కాదగినవని నిర్దేశించింది. పోగా, మిల్లిగన్ అనే ఇండియానా పౌరుడొకడు యీవిధంగా మిలిటరీ కోర్టులో విచారించబడి మరణదండనకు గురి అయాడు. తిరుగుబాటుదార్ల దాడులకు తరుచు గురి అవుతూ, యిండియానా రాష్ట్రం పక్కా యుద్ధభూమిగా వుండే రోజు లవి. ఆరాష్ట్రంలో కొన్ని ప్రాంతాలు మాత్రం కేంద్ర

* Art I, § 9, Cl. 2.

ప్రభుత్వానికి పూర్తియైన వ్యతిరేకస్థానాలు. అయినా సివిలు కోర్టులు మూయబడలేదు. ఇట్టి సందర్భంలో పైన ఉదాహరించిన ఆర్డరు రాజ్యాంగ చట్టానికి విరుద్ధం అని నిర్ణయించింది కోర్టు.* అత్యవసర పరిస్థితుల్లో, సివిలు కోర్టులు మూతపడి, నేర విచారణ జరగడానికి వేరేదారి లేనప్పుడు తప్ప, యుద్ధన్యాయం అమలు జరుగరాదని శాసించింది కోర్టు. ప్రజారక్షణ, ప్రజాక్షేమాలకొరకు యుద్ధన్యాయం అమలు జరుగవలసిందా లేదా అన్న విషయం నిర్ణయించవలసింది కూడా సివిలుకోర్టులే!

ఈ సిద్ధాంతాలు శాశ్వతత్వం సంపాదించినా, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో సైనికాధికారం యొక్క విపరీత ఫలితాలకు ఉదాహరణ కావాలంటే హవాయిలో చక్కని ఉదాహరణ కనుపిస్తుంది. హవాయి పూర్తిగా మిలిటరీ అధికారం క్రింద ఉంచబడింది. సివిలు కోర్టులు మూతపడ్డాయి. సైన్యాధికారి-ఒక జెనరల్-చట్టాలు జారీచేశాడు. అది అమలుజరిగే పద్ధతి కూడా అతనే నిర్ణయించాడు. సివిలుకోర్టులో సర్వసామాన్యమైన జూరీ పద్ధతి యొక్క ప్రమేయం లేకుండా అతని మిలిటరీ కోర్టులు ప్రజల్ని శిక్షించడం మొదలుపెట్టాయి. ఖాతాదారులను మోసం చేసినందుకు వాటాలమ్మే మధ్యవర్తులకి తీవ్రమైన శిక్ష, రాకపోకల హద్దులు మీరిన స్వల్పనేరానికి అయిదు సంవత్సరాల కఠినశిక్ష, అయిదు వేల డాలర్ల జరిమానా విధించే అధికారం! ఈ మిలిటరీ ప్రభుత్వం డిశెంబరు 7, 1941 నాడు స్థాపించబడ్డది. ఆ తరువాత 1944 దాకా దీని సమంజసత్వాన్ని గురించి ప్రశ్న రానేలేదు. చివరికి, కాంగ్రెసు అనుమతి లేకుండా యీ ప్రభుత్వం ఏర్పడింది కనుక,

* Ex Parte Milligan, 4 Wall 2.

చట్టవిరుద్ధం అని నిర్ణయించింది కోర్టు.* మిల్లిగన్ కేసు నేర్పిన గుణపాఠం దృష్ట్యా, అంతసులువుగా మిలిటరీ రాజ్యం స్థాపించే హక్కు ఎవరికైనా ఉన్నదనుకోడం కేవలం భ్రమ.

దేశంలో సమరన్యాయం ప్రకటించే సమయాలు కేవలం పెద్ద యుద్ధాలకు మాత్రమే పరిమితంకావు. హింసా పద్ధతిలో ప్రజలు విజృంభించి, శాంతికి భంగం కలిగించే అవకాశాలు ఉన్న అనేక సమయాలలో, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు రెండూ సైన్యంయొక్క సహాయం కోరతాయి. సమ్మెలను భంగంచెయ్య డానికి, నూనెగనుల ఉత్పత్తి తగ్గించేందుకు, ఎలెక్షన్ల సమ యాల్లో వోటర్లను భయపెట్టేందుకు కూడా సైన్యసహకారం అర్థించడం కద్దు.† ఈ నడుమ శ్వేతేతర జాతులకు ప్రత్యేక స్కూళ్లను రద్దుచేసే కార్యక్రమం‡ సందర్భంలో ఫెడరల్ కోర్టు ఉత్తరువు 'లిటిల్ రాక్' అనే చోట అమలు జరుగకుండా ప్రతిఘ టించే నిమిత్తం 'అరకన్సాసు' గవర్నరు సైన్యాన్ని విని యోగించాడు.‡ దీనికి సమాధానంగా కోర్టు ఉత్తరువు అమలు జరగడంలో ఎంతమాత్రం అంతరాయం కలగకుండా, అమెరికా సంయుక్తరాష్ట్రాల ప్రెసిడెంటు సైన్యాన్ని పంపాడు. 'క్లింటెన్' అనేచోట టెన్నెసీ గవర్నరు కూడా ఇదే చర్య తీసుకున్నాడు.

సైన్యం రంగంలోకి దిగినంత మాత్రాన, పోలీసుశాఖ చేయవలసిన విధులన్నీ మిలిటరీ చేస్తుందని కాని, సివిలుకోర్టులు మూతబడగలవని కాని, వార్తాపత్రికలపై 'సెన్సారు' విధించ బడుతుందని కాని అర్థం కానే కాదు. పౌరశాఖల అధికారానికి

* Duncan V Kahanamoku, 327 U.S. 304.
† Douglas : The Right of the People P. 197-206
‡ School De Segregation.

బదులుగా మిలిటరీ అధికారం ఛాయపరచడం ప్రతి ఒక్క విష యంలోనూ ఎంతవరకు సమర్థించవచ్చు అన్నది సివిలు కోర్టు నిర్ణయించాలి.

ఒక్కొక్కప్పుడు మిలిటరీ న్యాయస్థానాలు సివిలు కోర్టుల ధర్మాన్ని నిర్వహించాలని ప్రయత్నిస్తాయి. మిలిటరీ అధికారులు పౌర అధికారులతో పడే ఘర్షణ కిది రెండో సదస్సు. సమర న్యాయానికి వ్యతిరేకంగా సైనికులు జరిపే అకార్యాలను విచారించే నిమిత్తం, మిలిటరీ కోర్టులను ఏర్పరచడం, వాటిని గురించిన నియమావళి తయారు చెయ్యడంకూడా అక్కడి కాంగ్రెసుయొక్క అధికార పరిధిలోనిదే.న్యాయసమ్మతమైన విచా రణాపద్ధతి యేర్పరచి, తద్వారా నిందితునికి ఎంతో రక్షణ చేకూర్చే విషయంలో ఆ కాంగ్రెసు చాలా కృషిచేసింది. ఎంతయినా, రాజ్యాంగచట్టం ఛాయలో జరిగే సివిలు విచారణకీ, మిలిటరీ విచారణకీ హస్తిమశకాంతరం. మచ్చుకి, మిలిటరీ కోర్టులో విచా రణ జరిపే న్యాయమూర్తికి సరియైన శిక్షణ ఉండదు. ఫెడరల్ న్యాయమూర్తులకువలె వారి నౌఖరీలు జీవితాంతం వుండేవికావు. అందుచేత వారు నిర్భయంగా, స్వతంత్రంగా వ్యవహరించడానికి ఆటంకాలు వస్తాయి. పైగా, జ్యూరీ సమక్షంలో విచారణ జరుపు కునే అవకాశం నిందితుడికి లేదు కదా!

కాగాపోగా, 'హేబియస్ కార్పస్' పిటీషనుద్వారా, మిలిటరీ కోర్టులో, నిందితునికి చట్టబద్ధంగా సరియైన న్యాయం జరిగిందా లేదా అన్న విషయం సివిలు కోర్టు పరిశీలించవచ్చు.

అంతర్యుద్ధకాలంలో, మిలిటరీ కంట్రాక్టర్లనందరినీ, మిలి టరీ కోర్టులలోనే విచారించాలని కాంగ్రెసు నిర్ణయించింది. కొన్ని సంవత్సరాలు గతించిన తరువాత, యిది రాజ్యాంగచట్టానికి

విరుద్ధం అని తేలింది.* విదేశాలు వెళ్ళిన సైనికుల కుటుంబా లను సివిలు కోర్టులలో మాత్రమే విచారించాలనీ, మిలిటరీ కోర్టులలో విచారించరాదనీ ఈ నడుమ సుప్రీం కోర్టు నిర్ణ యించింది.†

సైన్యంనుంచి విడుదల అయిన వారికి, తాము సైన్యంలో ఉన్న కాలంలో చేసిన నేరానికైనా సరే, మిలిటరీ కోర్టులో విచారణ జరుగరాదు.‡ ప్రస్తుతం, విచారణసమయంలో, సైన్యంలో ఉన్న వారివరకే మిలిటరీ కోర్టుల అధికార ఆవరణ పరిమితం అయివుంటుంది. స్వదేశంలో కాని విదేశాలలో కాని, సైన్యంలో కాని సైన్యంకొరకు కాని, పనిచేసే సివిలుపౌరులు తమ నేరాలకు సివిలుకోర్టులముందే విచారించబడుతారు కాని మిలిటరీకోర్టుల ప్రసక్తి రానేరాదు.

## నిందితుని హక్కులు

రాజ్యాంగచట్ట సంబంధమైన దావాలు చాలావరకు నింది తుని హక్కులకు సంబంధించి వుంటాయి. నిందితుని హక్కుల జాబితా పరిశీలిస్తే, మూడు శతాబ్దాలక్రితం పెక్కుదేశాలలో ఉండే పద్ధతికి, ప్రస్తుతకాలంలో నిరంకుశపాలనలో ఉన్న దేశాల లోని పద్ధతికి అమెరికా విచారణాపద్ధతికి ఎంత వ్యత్యాసం ఉందో స్పష్టపడుతుంది.

1. ఈ హక్కులలో బహిరంగంగాను, శీఘ్రంగాను నేర విచారణకు గల హక్కు మొదటిది. దీనికి భిన్నమైన పద్ధతుల

* Ex Parte, Henderson, 11 Fed. Cas 1067.
† Kinsella V Singleton 361, U.S. 234.
‡ Toth V Quarles 350 U.S. 11.

వల్ల-అనగా సుదీర్ఘకాలం పొడిగించబడ్డ విచారణ, రహస్య విచారణలు, నిందితునికి అన్యాయం జరుగగలదనే భయం చేత, అమెరికా సాంప్రదాయం అంగీకరించదు.

2. జ్యూరీ పద్ధతి : ధనమాన ప్రాణాలకు సంబంధించిన విషయాలలో కేవలం ఏ ఒక్క న్యాయాధికారినీ నమ్మదు ఆ రాజ్యాంగచట్టం. పలువురు పెద్దమనుష్యులు సభ్యులుగా గల జ్యూరీ, ఏకముఖంగా వెలిబుచ్చిన అభిప్రాయం మీద నేర నిర్ణయాన్ని ఆధారితం చేస్తుంది. కొన్ని సందర్భాలలో ఈ జ్యూరీ పద్ధతిని ప్రక్కకు నెట్టవచ్చు. కాని యిరవై డాలర్లకు మించిన పరిహారం అర్థిస్తూ తేబడిన కేసులో ప్రతీ కక్షిదారునికీ, క్రిమినలు చర్యలో ప్రతీ నేరస్థునికి మాత్రం జ్యూరీ సమక్షంలో విచారణ జరిగితీరాలని కోరే హక్కు ఉంది.

ఈ జ్యూరీ పద్ధతికి స్వస్తి చెప్పాలని కొంతమంది వ్యక్తులు బహుకాలంగా ప్రయత్నించారు. న్యాయమూర్తి ఒక్కడే వ్యవహరించే సమయాలు ఈపద్ధతిని సంక్షిప్తం చేసే ఉపాయాలలో ఒక్కటి. న్యాయమూర్తి ఒక్కడే కూర్చుని అశ్లీల వాఙ్మయ విక్రయంపై తీర్పు చెప్పే అధికారం ప్రసాదిస్తూ అనేక రాష్ట్రాలు చేసిన శాసనాలు దీనికొక చక్కని ఉదాహరణ. న్యాయస్థానాన్ని తృణీకరించిన నేరానికి జ్యూరీలేకుండా జడ్జి మాత్రం విచారించి, నేరస్థునికి జరిమానాలు, ఖైదులు విధించడం మరో ఉదాహరణ. చట్టదూరమైన చర్యల సందర్భంలో తేబడిన సివిలు దావా-దీనినే 'ఈక్విటీ' దావా అంటారు—విచారణకు జ్యూరీకావాలనే హక్కు నేరస్థునికిలేదు. ఒక్క న్యాయాధికారి, మరెవరి సలహా సంప్రతింపుల అవసరం కించిత్తూ లేకుండా, పుస్తకాల షాపులను క్రిందుమీదుచేసి, న్యాయస్థానాన్ని తృణీకరించా

రన్న మిషపై శిక్షించే అధికారం కలిగివుంటే, అమెరికన్లు పౌర హక్కులు తప్పక నష్టపోయారన్నమాట. జ్యూరీల సహాయం బొత్తుగా అవసరం లేకుండా న్యాయాధికారులు శిక్షించే అధికారంగల కేసులను బాగా పరిమితం చెయ్యాలి. న్యాయాధికారులు నిరంకుశంగా ప్రవర్తించకుండా ఉండగలందులకు చక్కని కవచం వారి జ్యూరీ పద్ధతి. నిజానికి జ్యూరీ అభిప్రాయం సంఘంయొక్క అభిప్రాయం అనవచ్చు. జడ్జీలు తీవ్రంగా శిక్షించినపుడు సంఘం సానుభూతి చూపించిన సమయాలు ఎన్నో ఉన్నాయి చరిత్రలో. న్యాయాధికారులు దౌర్జన్యంగా ప్రవర్తించకుండా కాపాడే రక్షరేకువంటిది జ్యూరీపద్ధతి.

3. 'ఏనేరంలోనూ, తనకు వ్యతిరేకంగా తానే సాక్ష్యం యిచ్చుకోవలసిందిగా, ఏవ్యక్తిని కాని బలవంతపరచరాదు. (—ఐదవ సవరణ) నిందితుడు సాక్ష్యం యివ్వనని నిరాకరించే విషయం చాలా ముఖ్యమైనదిగా భావించి, వారిపూర్వులు దాని హోదాను రాజ్యాంగ రక్షణస్థాయికి పెంచారు. ఈ హక్కు, కేవలం నేరవిచారణనుండి, తదితర కేంద్రన్యాయ విచారణలలో కూడా తనకు వ్యతిరేకంగాఉపయోగపడే అవకాశంగల 'సాక్ష్యాల సరంలో ఏ ముఖ్యపూసనో' దాఖలు చెయ్యనని ఒకవ్యక్తి నిరాకరించేటంతవరకు వర్తించగలదు.* ఈ హక్కును ఉపయోగించుకున్న కారణంగా వ్యక్తులను కేంద్రప్రభుత్వం కాని రాష్ట్ర ప్రభుత్వం కాని శిక్షించరాదు. తనకు వ్యతిరేకంగా తాను సాక్ష్యం యివ్వడం నిరాకరించిన వ్యక్తియొక్క చర్యను, నేరం ఒప్పుకున్నట్లు కాని, అబద్ధసాక్ష్యం యిచ్చినట్లు కాని గణించడం

* Counselman V Hitchcock 142 U.S. 547.
Blau V United States, 340 U.S. 159, 161.

మొదలుపెడితే, యీ హక్కు నేతిబీరకాయలోని నెయ్యివలె మృగ్యం అవుతుంది.* ఏ అకార్యం చెయ్యకపోయినా, తనమీద నేరారోపణజరగవచ్చనే భయం కొద్దో గొప్పో ఉండవచ్చు. అనుమానాస్పదమైన పరిస్థితుల నడుమ చిక్కుకున్న అభాగ్యులను రక్షించడం అయిదవ రక్షణ చేసేపని. ఎన్నో రాష్ట్రాలు కూడా తమ అధికార పరిధుల్లో యిటువంటి రక్షణలను ప్రసాదిస్తూ ఉంటాయి.

మధ్యకాలపు యూరపులో నేరస్థులను నానాహింసలు పెట్టేవారు. నేరాల్ని దర్యాప్తు చెయ్యడానికి వారవలంబించిన పద్ధతి అది. కొంతమంది పోలీసు అధికారులకి యిప్పటికీ యీ పద్ధతి అంటే ప్రీతి ఎక్కువ. అభాగ్యులైన నిందితుల్ని రక్షించే ప్రయత్నాలు కోర్టులు నిర్విరామంగా చేస్తూనే వుంటాయి. బలవంతంవల్ల, హింసలుపడడంవల్ల తాను అపరాధి అని వొప్పుకున్నా, ఆ మాటలు కోర్టులు అంగీకరించవు.† హింస అనేది దెబ్బల ఫలితంగా కలిగించబడ్డ శారీరకహింస కావచ్చు. మానసికంగాను, మోసంవల్లను కలిగినవికూడా కావచ్చు.‡ అయిదవ సవరణ§ ఫలితంగా తనకు వ్యతిరేకంగా తానే యిచ్చిన

* Slochower V Board of Education, 350 U.S. 551, 557.

† Chambers V Florida 309 U.S. 227.

‡ Leyra V Denno, 347 U.S. 556.

§ లోగడ పరిశీలించినట్లు, 14 వ సవరణలోని చట్ట సమ్మతమైన క్రమపద్ధతి అన్న అంశాన్ని పురస్కరించుకొని, న్యాయస్థానాలు మొదటి ఎనిమిది సవరణలలో ఎన్నో అంశాలు రాష్ట్రాలకు కూడా వర్తిస్తవని నిర్ణయించినది. ఉదాహరణకు మొదటి సవరణలోని హక్కులు: (చూడు Gitlow V New York 268 U S. 652, 666; Murdock V Pennsylvania, 319 U.S. 105,

సాక్ష్యం ఫలితంగా, ఫెడరల్ కోర్టులలో శిక్షపాలు చెయ్యరు. రాష్ట్రాలలో రక్షణ యింతమేరకు ఉన్నా లేకపోయినా, బలవంతంగా నేరం ఒప్పుకున్న వాఙ్మూలంపైననే ఆధారపడి కోర్టులు శిక్షించరాదు. చట్టసమ్మతమైన క్రమపద్ధతి విధించిన షరతుల ధర్మమా అని యింతమాత్రం రక్షణ నిందితునికి లభిస్తుంది.*

ఫెడరల్ విషయాల్లో చిత్రహింస దౌర్జన్యాల ప్రభావాన్ని తగ్గించే నిమిత్తం, అరెష్టయిన వ్యక్తిని వెంటనే మాజస్ట్రేటు సమక్షానికి తీసుకురావాలని చట్టంయొక్క ఆజ్ఞ. దీనివల్ల అరెష్టయిన వ్యక్తియొక్క బంధుమిత్రులకు ఇతను ఎక్కడ వున్నది, దేనికిగాను అరెష్టయినది తెలుసుకునే అవకాశం కలుగుతుంది.† ఎన్నో రాష్ట్రాలలో యించుమించు యిటువంటి అవకాశాలున్నాయి.

4. అధికారరహితమైన తనిఖీలు, అరెష్టులు, జప్తులు: అనుమానంమీద, అధికారపత్రం లేకుండా, తమ నేరనిరూపణ కోసం పోలీసులు వ్యక్తుల యిండ్లు మొదలైనవి సాక్ష్యంకోసం తనిఖీచేసే ఉద్దేశంతో వుంటారు.

అమెరికా రాజ్యాంగచట్టంక్రింద, కోర్టువారివద్దనుండి పొందిన వారంటులేకుండా యిల్లుకాని ఆఫీసుకాని సోదా చెయ్యడం తప్పు.

---

Board of Education V Barnette 319 U.S 625). అయినా కొన్ని చోట్ల అల్పసంఖ్యాకమైన న్యాయమూర్తుల అభిప్రాయాన్ని ఆధారంగా చేసుకుని, అయిదవ సవరణలోని ఆత్మవిద్రోహకరం అయిన సాక్ష్యం (చూడు Adamson V California 332 U.S. 46) ఆరవసవరణలోని న్యాయవాదిని పెట్టుకునే హక్కు. (చూడు Betts V Brady, 3 .6 U.S. 451) పూర్తిగా రాష్ట్రాలయెడ వర్తించదని నిర్ణయించారు.

చూడు Douglas : We the Judges (1956) pp 262 ff.

* Brown V Mississippi, 297 U.S. 278.

† Mallory V United States 354 U.S. 449

నేరానికి సంబంధించిన సాక్ష్యం తప్పకుండా దొరికే అవకాశం గట్టిగా వున్నదని రుజువు చేస్తేకాని కోర్టువారు తనిఖీపత్రం యియ్యరు. అప్పుడుకూడా తనిఖీ చెయ్యదగిన స్థలాలు, తనిఖీలో తాము జప్తుచెయ్యదగిన వస్తువులూ నిక్కచ్చిగా వివరించి మరీ యిస్తారా తనిఖీ పత్రాన్ని.

నేరం జరగడం అధికారి స్వయంగా చూచినప్పుడూ, తప్పక అతడే నేరస్థుడని గట్టి నమ్మకం వున్నప్పుడూ తప్ప, వారంటులేకుండా అరెస్టు చెయ్యరాదు. అనుమానంమీద అరెస్టు చెయ్యడానికి ఆరాజ్యాంగచట్టం సమ్మతించదు.* వారంటులేకుండా అరెస్టు చెయ్యబడ్డ అనుమానితుణ్ణి వెతకగా దొరికిన సామగ్రి ఏదీకూడా ఫెడరల్ కోర్టులలో నేరానికి దాఖలా అని సాక్ష్యంగా ప్రవేశపెట్టరాదు. అట్టి సరుకులు సాక్ష్యానికి పనికిరావు.† కొన్ని రాష్ట్రీయ కోర్టులుకూడా యిదే పద్ధతిని అంగీకరిస్తాయి.‡

టెలిఫోన్‌లో మాట్లాడినవి, యిళ్ళలోను, ఆఫీసుల్లోను మాట్లాడుకునేవి పొంచివినడం, శాస్త్రీయయంత్ర సామగ్రి యిచ్చిన సాధనాలద్వారా వారు మాట్లాడే మాటలు వినడం, ఈ రోజుల్లో చాలా సులువైనపని.§ ఈవిధంగా సంపాదించిన సాక్ష్యం, చట్టదూరం అని, అవి ఫెడరల్ కోర్టులలో చెల్లవని, ఆ కాంగ్రెసు నిర్ణయించింది. అనేక రాష్ట్రాల కోర్టులుమాత్రం యీ సాక్ష్యాన్ని అంగీకరిస్తాయి. సుప్రీంకోర్టు, అనేక విషయాల్లో అభిప్రాయభేదాలున్నా, తీగల ద్వారా దొంగచాటుగా వినే పద్ధతి

* Henry V United States 361 U.S. 98.
† Weeks V United States 232 U.S. 383.
‡ See People V Cahan, Cal. 44 (2d) 434.
§ Irvine V California 347 U.S. 128.

తనిఖీవంటిది అనీ, దానికి మేజస్ట్రేటు యిచ్చిన వారంటు కావాలనీ మాత్రం అనటంలేదు.*

వ్యక్తుల జీవితరహస్యాలను బట్టబయలుకాకుండా రక్షించే పద్ధతి, నేరాలు కూపీతియ్యడం కొంచెం కష్టతరంచేసి, నేరస్థుల జీవితాలను మరికొంచెం సుఖతరం చేసినట్లు కనిపించవచ్చు. కాని యీ పద్ధతే సరియైనదని అమెరికనుల చిరకాల అనుభవం. ఇతరులవలెనే పోలీసులుకూడా చట్టబద్ధులై ప్రవర్తించాలి. అనుమానంమీద అరెస్టులు, సోదాలు చేసి నేరస్థులను పట్టుకునే ప్రభుత్వానికి మనం అడ్డుచెపితే, వారి మేధాశక్తి మరికొంచెం వాడి అయి యింకొంచెం చురుకుగా పనిచేస్తుంది. సమాజానికి ఏనష్టం రాదు.

5. తన తరఫున న్యాయవాదిని ఉంచుకునే హక్కు: నిందితుడు తనఖర్చుతో అన్ని సందర్భాలలోనూ న్యాయవాది సలహాను పొందవచ్చు. ఫెడరల్ కోర్టులో మాత్రం, తాను ఖర్చుపెట్టలేనప్పుడు, నిందితుని ఉపయోగార్థం ప్రభుత్వ ఖర్చుపై న్యాయవాది నియమింపబడతాడు. రాష్ట్రాలలో కొన్ని ఈ సౌకర్యం కల్పిస్తున్నాయి; కొన్ని కల్పించటంలేదు. మరణశిక్షకు పాల్పడవలసిన ప్రతినేరస్థునికి న్యాయవాది సలహా లభించి తీరాలి.† కాని ఒక్కొక్కప్పుడు కొన్ని చోట్ల నేరస్థుడు పేదవాడై, చట్టంసంగతి తెలియక సరియైన న్యాయవాది సలహా కూడా లేక అవస్థలపాలు అవుతుంటాడు. ‡

---

* On Lee V United States, 343 U.S. 747.

† Powell V Alabama 287 U.S. 45.

‡ Betts V Brady 316 U.S. 455.

6. తనమీద ఆరోపించబడిన నేరమేమిటో స్పష్టంగా తెలుసుకునే హక్కు; తనకేసుకు అనుకూలంగా సాక్ష్యాన్ని ప్రవేశపెట్టే హక్కు; తనకు అనుకూలమైన వ్యక్తులను సాక్ష్యానికి హాజరు పెట్టడానికి ''కోర్టు సమన్సు'' ఉపయోగించే హక్కు: ఫెడరల్ కోర్టులలోను, స్టేట్ కోర్టులలోను, చట్టసమ్మతమైన క్రమపద్ధతిని అమలుజరపడానికి ఇవి అన్నీ ప్రముఖ సోపానాలు.

7. నిష్పక్షపాతమైన విచారణకు హక్కు: ప్రజాందోళన నడుమ విచారణ జరిపినప్పుడు కాని, నిందితునికి తన వాదం సిద్ధం చేసుకుందుకు కావలసిన సమయం యివ్వనప్పుడు కాని, మరణశిక్ష పొందగల నేరస్థుడికి చట్టసమ్మతమైన క్రమపద్ధతిలో విచారణ జరగలేదనే చెప్పాలి. * నేరస్థులపై విధించిన జరిమానాలమీద ఆధారపడ్డ జీతం కల పోలీసు కోర్టు, జడ్జీల తీర్పులు కూడా యీ కారణంచేత చెల్లనేరవు. నేరస్థుణ్ణి శిక్షించడంమీదే ఆధారపడ్డ జీతంగల జడ్జి యొక్క నిర్ణయంకూడా సరియైనది కాదు.†

8. నిర్దుష్టంగాలేని చట్టాలు, కార్యానంతర నేరారోపణాశీలమైన చట్టాలనుండి రక్షణ: చట్టమేదో తెలియని అజ్ఞానం చట్టాన్నతిక్రమించి ప్రవర్తించడానికి ఒక రక్షణకాదు. చట్టమేదో స్పష్టంగా ఉన్నదనీ, అది తెలుసుకోదలచిన వారికి సులు

* Moore V Dempsey 261 U.S. 86.
† Tumey V Ohio 273 U.S. 510.

వుగా తెలుసుకునే అవకాశం వున్నదనీ దీని ప్రాతిపదిక. ఒక రోమను చక్రవర్తి గోడమీద చాలా ఎత్తున—చదవాలనుకున్న ప్రజలకుకనిపించనంత ఎత్తుగా—చట్టాలను వ్రాయించాడు. అందుచేత ప్రజలకు చట్టబద్ధమైన కార్యం ఏదో, కానిదేదో తెలుసుకునే అవకాశం లేకపోయింది. చట్టసమ్మతమైన క్రమపద్ధతి అనటంలో వారి అభిప్రాయం ఏమిటంటే 'ఫలానా నేరం నువ్వు చేశావు' అని ఒకరిని వారు అనేముందు న్యాయం అన్నది ఎంతవరకు వున్నదో, చట్టానికి అవధులు ఏమిటో స్పష్టంగా అతనికి తెలుసునని, తెలుసుకోడానికి సంపూర్ణమైన అవకాశం ఉన్నదని వారికి ప్రథమంలోనే స్పష్టంకావాలి. రష్యాలో 1958 వరకు, కోడ్‌లో స్పష్టంగా లిఖింపబడ్డ నేరాలకు సారూప్యమైన నేరాలు చేసిన వారందరూ శిక్షకు పాల్పడగలరని వ్రాసి వుండేది. నేరారోపణచేసే అధికారులకు, కోర్టులకు నేరాలను—వారి దృష్టిలో నేరాలనుకునే వానిని చేర్చి—విరివిగా పెంచే అవకాశం విస్తరించింది. "పోలీసు వారిని ఎదుర్కోడం నేరం" అని శిక్షాస్మృతిలో వుంచే మరో ప్రభుత్వోద్యోగిని ఎదిరించడం కూడా నేరంగా పరిగణింపబడవచ్చు. ఈ ప్రభుత్వోద్యోగుల పేర్లు కోడ్‌లో లేకపోయినా సరే. ఈ పద్ధతికి ఆ దేశం ఎన్నడూ అంగీకరించలేదు.

కార్యానంతర నేరారోపణాత్మకమైన చర్యలకు చాలా చక్కని ఉదాహరణ హంగేరీ చరిత్రనుండి మనకు లభిస్తుంది. హంగేరీ చట్టాల ప్రకారం, 1956 లో పాల్గొన్న బాలుర్ని ఉరి తీయడానికి వీలులేదు. పద్దెనిమిది సంవత్సరాల పైవారికే శిరచ్ఛేదం. అంతకన్న చిన్న వారిపై ఆ శిక్ష విధించరాదు. అందు

చేత విద్రోహకార్యాలు చేసిన బాలుర్ని, వారికి పద్దెనిమిది సంవత్సరాలు వొచ్చేదాకా, జైళ్లలో భద్రంచేసి ఆ తరువాత సలక్షణంగా వారిని ఉరికంబమెక్కించారు! ఈవిధంగా, నేరం జరిగిన తరువాత శిక్షను పెంచారు. ఇటువంటి చట్టాలు—ఏదైనా ఒక కార్యం చేసిన తరువాత దానిని నేరంగా పరిగణించడం కాని, చేసిన అకార్యానికి శిక్ష పెంచడం కాని—అమెరికా దేశంలో పాసు కారాదు.

9. బిల్స్ ఆఫ్ ఎట్టెయిండర్* లనుండి రక్షణ: శాసన సభలో ఒకచట్టం పాసుచేసి, వ్యక్తుల్ని నేరస్థులుగా నిర్ణయించే పద్ధతి ఒకప్పుడు ఉంటూ ఉండేది. ఇంగ్లండులో యిది పది హేను, పదహారు శతాబ్దాల కాలంలో విరివిగా ప్రాబల్యంలో వుండేది. 'శాసన సభ విచారించి శిక్షించడం' అంటే సాధారణంగా ఆ అభాగ్యుడి ఆస్తి సర్వస్వం ప్రభుత్వానికి నైవేద్యం కావడం, అతడికి దేశాంతర ప్రవాసం ప్రాప్తించడం అన్న మాట. ఇతనికి బాకీవున్న వారందరూ మాత్రం, సామాన్యంగా ఆ బాకీలు తీర్చవలసిన బాధనుండి విముక్తిచెందుతారు. ఒక్కొక్కప్పుడు శిక్ష నేరస్థుని వారసులదాకా కూడా పోయేది. అతని రక్త స్పర్శ కలవారందరికీ ఆస్తిహక్కు నాశనం. అధికారుల మతానికి చెందనివారియెడలా, రాజకీయంగా ప్రభుత్వ వ్యతిరేకులయెడలా ఈ ఆయుధం ప్రయోగింపబడేది. ఇంగ్లాండు నుండి విడిపోయి, అమెరికన్లు స్వతంత్రం సంపాదించిన సమయం నుండి 1787 లో రాజ్యాంగచట్టం అమలులోకి వచ్చేలోగా, పోరాటంలో అమెరికన్లకు వ్యతిరేకంగా ఇంగ్లండును బలపరిచిన వారిని ఈ ఆయుధం ప్రయోగించి ఎన్నో రాష్ట్రాలు శిక్షించాయి.

* Bills of Attainder.

బిల్స్ ఆఫ్ ఎట్టెయిండర్ ధర్మవిరుద్ధం అన్నప్పుడు యీరకం శిక్షాపద్ధతికి అమెరికన్లు స్వస్తివాక్యాలు చెప్పారు. ప్రభుత్వం ఎవరినైనా శిక్షించాలి అంటే—ఫెడరల్ ప్రభుత్వం కాని, రాష్ట్రప్రభుత్వం కాని—న్యాయస్థానాలలో చర్యతీసుకో వచ్చు. కొంతమంది ఫెడరల్ ఉద్యోగుల్ని దేశద్రోహులుగా నిశ్చయించి, వారి జీతబత్తాలకు ఫెడరల్ ధనం ఎన్నడూ విని యోగించబడరాదని కాంగ్రెసు నిర్ణయించడం 'బిల్ ఆఫ్ ఎట్టె యిండర్' అవుతుందని 1946 లో కోర్టు ఘంటాపథంగా చాటింది.*

ఉద్యోగంనుండి తీసివేయడం, దేశద్రోహి అని అతనికి ముద్రవేయడం, యించుమించుగా సంఘ బహిష్కారం ప్రసా దించడం-యివన్నీ శిక్షించడంక్రింద జమకట్టబడ్డాయి.

మొత్తానికి ఈ ఆచరణ పద్ధతులు అమెరికన్ల స్వాతంత్ర్యానికి చాలా అవసరం అయిన రక్షణలు. నిరంకుశత్వాన్నుండి,చట్టాలు అమలు అయే క్రమపద్ధతిని రక్షించకపోతే, ప్రజలకు అసలు న్యాయం—ఆస్తిహక్కు, ఏదినేరం, ఏదికాదు మొదలైన వాటి దృష్ట్యా—జరగనే జరగదు. రహస్యంగా విచారణ జరిగి, తను చేసిననేరం ఏమిటో స్పష్టంగా తెలియక, చిత్రహింసవల్ల నేరం ఒప్పించే పద్ధతిలో వ్యవహారం నడిపి, తన తరఫున వాదించ డానికి న్యాయవాది లేకుండా, విచారణ జరిగితే, నిందితుని వెనుక ఎంతన్యాయం వుంటే మాత్రం ఏమి లాభం? అతని హక్కులకు రక్షణ మృగ్యం. చిల్లుకుండలో ఎన్ని నీళ్ళుపోసినా ఏమిలాభం? రాజ్యాంగచట్టంలో భద్రపరుపబడ్డ ఆచరణ క్రమం, వాటికి సంబంధించిన హక్కులు, నిజానికి వారి

---

* United States V Lovett 328, U.S. 303.

స్వతంత్ర పూరితమైన దేశాన్ని కేవలం 'పోలీసు' రాజ్యంనుండి వేరుచేసే ముఖ్యచిహ్నాలలో ఒకటి.

సక్రమమైన విచారణలో దోషిగా నిర్ణయింపబడితే తప్ప, ఏవ్యక్తీ శిక్షింపబడరాదు అన్నది వారిధ్యేయం. ఇంతమాత్రం చేత నేరస్థుడికి సౌకర్యాలు, పోలీసు వారికి ఇబ్బందులు కలిగించడం వారి ఉద్దేశం కానేకాదు. కేవలం నిర్దోషులను రక్షించడమే వారి ఆశయం. నిర్దోషులను రక్షించాలి అంటే అందరియెడలా సమానమైన చట్టం ఉండడమే తరణోపాయం అని వారు అనుభవంతో గుర్తించి చాలాకాలం గడిచింది. ఇందులో వ్యక్తులకు ఒక న్యాయం, పోలీసువారికి మరోన్యాయం, జడ్జీలకు మూడో న్యాయంలేదు. చట్టదృష్ట్యా అందరూ సమానమే. ఈ సమానత్వం సిద్ధింపజేసుకోడానికి, చట్టం అమలు జరిగే క్రమపద్ధతి సాధనం. ధ్యేయం ఎంతముఖ్యమో దానిని సాధించడానికి సాధనం కూడా అంతముఖ్యమే,

ఆస్తిహక్కులు:

స్వేచ్ఛాప్రాప్తికి ఏపథకం వేసినా, అందులో ఆస్తి చాలా ముఖ్యమైన స్థానం ఆక్రమించుకుంటుంది. వ్యక్తి తన వ్యక్తిత్వానికి చిహ్నంగా ఆస్తిని కూర్చుకుంటాడు. తన ఊహాలకు ప్రతిబింబంగా ఒక చిన్న ఇల్లు కట్టుకుంటాడు, అందులో తనకు కావలసిన నాలుగు పుస్తకాలు, నచ్చిన నాలుగుబొమ్మలు పెట్టుకుంటాడు. అది అతని గృహం; అతని కోట; తొంగిచూచే ప్రపంచం కళ్ళనుండి ఒకచాటు, ఒక అడ్డు; పెద్ద పిట్ ఒకసారి అన్నట్టు:

"ఆ పూటకు లేని నిరుపేద తన కుటీరంమేరకు మహారాజాధిరాజు. ఆ కుటీరంమేరకు ప్రభుత్వపు రాచరికాన్ని కూడా

లక్ష్యంచెయ్యడు. ఆ గుడిసె చాలా జీర్ణమైనది కావచ్చు. కప్పుకు స్థిరత్వం లేకపోవచ్చు. దాంట్లోంచి గాలి స్వేచ్ఛగా పారవచ్చు. వాన నిరాఘాటంగా లోపలికి రావచ్చు. కాని ఇంగ్లీషు రాజు మాత్రం లోపలికి రారాదు. అతని రాజశక్తి యావత్తూ ఆ జీర్ణ కుటీర ప్రాంగణం దాటలేక, గడగడలాడిపోతుంది.''

పోలీసు లీకారణంగా, తమ యిచ్ఛవచ్చినప్పుడు యిళ్లల్లో చొరబడి సోదాచెయ్యడానికి వీలులేదు. మేజస్ట్రేటు దగ్గరకు పోయి, ఫలానా యింట్లో నేరస్థుడని నమ్మడానికి బలమైన కారణాలుగల ఒకవ్యక్తి ఉన్నాడనీ, అతనినిపట్టి బంధించడానికి ఆ యిల్లు సోదాచెయ్యడం అత్యవసరం అనీ ఒప్పించి అతనివద్ద ముందుగా అనుమతిపత్రం పొందాలి. వ్యక్తుల వాహనాలు, కాగితాలు, పుస్తకాలు మొదలైనవి అతని గృహంలాగే ఆస్తి. ఇచ్ఛవచ్చిన వారు యిచ్ఛవచ్చినట్లు వానిని సోదాచెయ్యరాదు. వాటికీ చాటు, మరుగు అనేవి వున్నాయి.

ఆస్తి వినియోగించే పద్ధతివల్ల ఒకప్పుడు ప్రజా బాహుళ్యం సౌకర్యాలకు భంగం కలుగవచ్చు. అధికారులకు దీనినిగురించి శాసించే బాధ్యత వుంది. పట్టణం అందంగా వుండాలంటే, ఒక్కొక్క ప్రాంతం, ఒక్కొక్క పనికోసం ప్రత్యేకింపబడవలసివొస్తుంది. ఈ పనులు చెయ్యడానికి సంఘం అభ్యంతరం చెప్పదు.* ఈ కేటాయింపుపద్ధతి ఏదైనా ఒక ప్రత్యేక ప్రయోజనం కోసం మాత్రమే కాక, పట్టణం అందంగాను, ఆరోగ్యవంతంగాను, పరిశుభ్రంగాను చెయ్యడానికి కూడా ఉపయోగ పడవచ్చు.†

---

* Euclid V Ambler & Co., 272 U.S. 362.

† Berman V Parker 348 U.S. 26.

ఫ్యాక్టరీలలో పరిస్థితులను—జీతబత్తాలు, పనిచేసే గంటలు మొదలైనవి—సరిదిద్దే ఉద్దేశంతో ప్రభుత్వంచేసిన ప్రయత్నాలను ఫ్యాక్టరీయజమానులు విజయవంతంగా ప్రతిఘటించిన సమయాలు కూడా వుండేవి.* పద్నాలుగవ సవరణవల్ల తమకు దఖలుపడ్డ ఆస్తిహక్కులు, ఒప్పందాలు కుదుర్చుకోడానికి తమకు గల స్వాతంత్ర్యం ప్రభుత్వ కార్యాలవల్ల దెబ్బతిన్నాయని యజమానుల వాదన. అయితే, జీతాలు మొదలైనవాటి సవరింపువల్ల ఆస్తి విలువలు మారేమాటలో అసత్యం ఏమీలేదు. ప్రజోపయోగసంస్థలు (విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థలవంటివి) తాము విధించే రుసుములను, పెద్ద పెద్ద గృహ యజమానులు తమ యిళ్ళకు వసూలుచేసే కిరాయిలను సంస్కరిస్తే, ఆస్తుల విలువలు మారడం తథ్యమే కదా.†

తన యిచ్చవచ్చిన కూళ్ళు ఫ్యాక్టరీ యజమానులు యివ్వడానికి వీలుంటే, తమ కిట్టింపు పెరిగేమాట వాస్తవమే. కాని శాసనాలద్వారా రాష్ట్రాలు, ఫెడరల్ ప్రభుత్వాలు అన్నీ కలిసి, ఎన్నో కట్టడులు విధించాయి. కొన్ని పరిశ్రమలలో కనీసవేతనాలు నిర్ణయించబడ్డాయి. దీనికి కోర్టులు కూడా అనుమతించాయి.‡ ధరలపై కంట్రోళ్ళు కూడా కోర్టు ఆమోదాన్ని పొందాయి.§ ప్రజోపయోగసంస్థలు (విద్యుచ్ఛక్తి సరఫరా సంస్థలవంటివి) వసూలు చేయదగిన రుసుములను ఎప్పటినుంచో నిర్ణీతం చేస్తున్నారు. నిజానికి, సాంఘిక సంక్షేమపరం అయిన చట్టాలపట్ల

* Lochner V New York, 198 U.S. 45.

† Block V Hersch, 256 U.S. 135

‡ West Hotel Co. V Parrish 300 U.S. 379

§ Nebbia V New York, 291 U.S. 502; Sunshine Coal Co. V Adkins 310 U.S. 381.

కోర్టుల అభిప్రాయం ఒకప్పుడు హోమ్స్, బ్రాండేస్‌వంటి న్యాయమూర్తులు కోరినంత అనుకూలంగా వున్నది. ఆవశ్యకతగాని, ప్రజోపయోగం కాని కించిత్తైనా ఉన్న చట్టాలను—చట్ట సమ్మతమైన క్రమపద్ధతిని అతిక్రమించకుండా—అమలు జరగనియ్యడమే గత ఏబది సంవత్సరాలుగా న్యాయస్థానాల ధ్యేయంగా కనిపిస్తున్నది.*

ఆస్తిపాస్తులు, వాటియెడ వారికిగల గౌరవం, వారి రాజ్యాంగ చట్టంలో చాలా ముఖ్యమైన స్థానం ఆక్రమించుకుంది. లాక్† మహాశయుడు 1690 లో వ్రాసినట్లు: "నాయిచ్ఛకు విరుద్ధంగా మరొకరు నానుండి తీసుకోగలిగిన ఆస్తిలో నాకు నిజానికి ఏ హక్కూలేదు." ఐదవసవరణ, ప్రయివేటు ఆస్తి దేనినీ 'ప్రజోపయోగ' మిషతో, సరియైన ప్రతిఫలం యివ్వనిదే తీసుకోరాదని నిషేధించింది. అంటే వెంకయ్య ఆస్తిని—వారు ఒకప్పుడు చేసినట్టుగా—తీసికెళ్ళి సుబ్బయ్యకు యియ్యరాదు. ప్రభుత్వం ఆస్తి తీసుకునే ఉద్దేశమే ప్రజోపయోగంకోసం అయివుండాలి. పైగా యజమానికి "తీసుకున్న ఆస్తితో పూర్తిగా సమానమైన విలువ గలధనం" ముట్టచెప్పాలి.‡ "తీసుకోడం" అంటే ఏమిటి అన్న విషయానికి కొంచెం విశాలమైన అర్థం యివ్వబడుతోంది. ప్రభుత్వ విమానాలు, నేలకు దగ్గరగా ఎగురడంవల్ల, కొన్ని రకాల వ్యవసాయానికి భూమి అనువుకాక పోవచ్చును. అటువంటి సందర్భాలలో ఆనేల విలువలో కొంతభాగం ప్రభుత్వం 'తీసుకున్న'దన్నమాట. దీనికి పరిహారం యిచ్చితీరాలి.♦

* Giboney V Empire Storage Co 336 U.S. 490.
† Treatise on Civil Government.
‡ United States V Miller 317 U.S. 369, 373.
♦ United States V Causby 328 U.S. 256.

# 4

## కార్యరంగంలో అమెరికన్ హక్కుల పట్టీ:



దుర్మార్గుల్ని తప్పక శిక్షకు గురిచెయ్యాలనే తీవ్రమైన పట్టుదలతో శాసన లిఖితమైన ఆచరణక్రమాన్ని బొత్తుగా లక్ష్యపెట్టని ప్రభుత్వ న్యాయవాది;

దేశరక్షణపట్ల దీక్షాకంకణుడై, సమరన్యాయాన్ని అనవసరంగా పౌరులపై రుద్దే సైనికాధికారి;

శాంతి భద్రతలను పరిరక్షించే నిమిత్తం, ప్రజల వాక్స్వాతంత్ర్యాన్ని తీవ్రంగా అరికట్టే పోలీసు అధికారి;

వంటి సన్మార్గులవల్లనే మన స్వేచ్ఛ కుంటుపడుతుంది. వీరందరి ఉద్దేశాలు మంచివే. అందులో ఏలోపమూ లేదు. విధి నిర్వహణయందుండే తీవ్రమైన ఆసక్తిచేత, యితరుల స్వేచ్ఛకు అంతరాయం కలిగిస్తున్నామనే అనుమానమే వుండదీ కర్తవ్యదక్షులకు. సాధారణంగా ఇట్టివారివల్లనే వారి స్వేచ్ఛకు అంతరాయం కలిగేది. కావాలని వారి పద్ధతులకు వ్యతిరేకంగా అకార్యాలు చేసేవారివల్ల వారి హక్కులకు కలిగే ఆఘాతం యొక్క పరిమాణం తక్కువే.

ఒక్క విషయం వారు గమనించాలి. ఉద్దేశాల మంచితనానికి, స్వేచ్ఛయొక్క భద్రతకి ఏమీ సంబంధంలేదు. స్వేచ్ఛా

వాయువును కలుషితం చెయ్యడం విషయంలో సంస్కారి, న్యాయదూరుడు—యిద్దరిలో తేడా తక్కువ. పద్ధతులు వేరైనా ఫలితం మాత్రం వొక్కటే. వారి రాజ్యాంగచట్టంచేసిన కట్టడులు ఎవరూ అతిక్రమించకుండ మనం హమేషా జాగ్రతతో ప్రవర్తించడమే స్వేచ్ఛను పరిరక్షించుకోడానికి ఏకైక తరణోపాయం. తాత్కాలికాందోళనలకు స్వేచ్ఛ ఒక్కసారి తల ఒగ్గిందా, మరి ఒకసారి అదేతల మరికొంచెం క్రిందికి దించకతప్పదు. హక్కుల కోసం పోరాటం నిరంతరం సాగవలసిందే.

"ఈ విషయాలతో నాకు సంబంధంలేదు; ప్రక్కయింటి వారి గొడవ నాకెందుకు? నీగ్రోలు, జపానీయులు, యహోవా సాక్షులు, నాస్తికులు, కమ్యూనిష్టులు, కమ్యూనిష్టు దృక్పథంకల యితరులు, నిరంకుశవాదులు, దుర్మార్గులు, అవినీతిపరులు మొదలైన వాళ్ళ హక్కులతో నాకేమిపని? అల్ప సంఖ్యాక వర్గాలు, ఉన్మాదప్రాయులు, పేచీకోరులు, కోర్టుపక్షులు-యిటువంటివారే 'స్వేచ్ఛ' 'స్వేచ్ఛ' అని వెర్రికేకలు వేసేది. పెద్ద మనిషి అయిన సామాన్య అమెరికన్ పౌరుడు యీ విషయాలతో సంఘర్షణ పెట్టుకోడు" అని కొందరు అనవచ్చు.

"అసలు ఈ రకాల మనుష్యులకు రాజ్యాంగ చట్టం వల్లను, న్యాయస్థానాలవల్లను ఏవిధమైన రక్షణా లభించకూడదు. కమ్యూనిష్టులకి, నేరస్థులకి హక్కులేమిటి హక్కులు! వాటిని గురించి మాట్లాడే అర్హతకూడా వారికి లేదు" అంటారు మరి కొందరు.

ఈ దృక్పథం ఎంతో ప్రమాదభూయిష్ఠం. చూడండి! కమ్యూనిస్టులని మినహాయించి మరే వ్యక్తినిగాని తన జీవితం, స్వేచ్ఛ ఆస్తిపాస్తులనుండి చట్టంలో నిర్ణయించబడ్డ క్రమపద్ధ

తికి విరుద్ధంగా వేరుచేయరాదు'' అని వారి రాజ్యాంగచట్టంలో లేదు. ''ఏ వ్యక్తినిగాని తన జీవితం, స్వేచ్ఛ, ఆస్తిపాస్తుల నుండి చట్టంలో నిర్ణయింపబడ్డ క్రమపద్ధతికి విరుద్ధంగా వేరు చేయరాదు'' అని మాత్రమే శాసించింది వారి రాజ్యాంగచట్టం. ఇందులో మినహాయింపులు లేవు. వారికి నచ్చని మన స్తత్వాలు గల వ్యక్తుల్ని, వారి వ్యతిరేకుల్ని యీ శాసనం ప్రసాదించే రక్షణనుండి దూరంచేసే అధికారం వారికేకాదు, మరెవ్వరికీలేదు. నిజానికి వారిలో ప్రతి వ్యక్తియొక్క స్వేచ్ఛ ప్రజలందరి స్వేచ్ఛతో అవినాభావ సంబంధం కలిగివుంది. వాటిని వేరు చేయలేరు. మాటవరసకు ''కమ్యూనిస్టు''లకు రాజ్యాంగరక్షణ లేదు అంటారనుకోండి. వెంటనే 'కమ్యూనిస్టు' అంటే ఎవరు? అన్న ప్రశ్న బయలుదేరుతుంది. కేవలం పార్టీలో మిళితం అయిపోయి, సంపూర్ణమైన సభ్యత్వ చిహ్నాలు కలవారినే 'కమ్యూనిస్టు' అనాలా, లేక పూర్తి సభ్యత్వం లేకపోయినా, పండిపోయిన కమ్యూనిస్టుల కేవిధంగానూ తక్కువ కాని ఉత్సాహంతో అజ్ఞాతంగా వుండేవారు కూడా యీ నిర్వచనం క్రిందికి వొస్తారా? ఈ రెండవ శ్రేణివారికికూడా వాక్స్వాతంత్ర్యం రద్దు చెయ్యాలా? అన్నది తరువాతి ప్రశ్న. ఈ అజ్ఞాత కమ్యూనిస్టు మహాశయులకు కూడా వారు రాజ్యాంగం బహిష్కారమే ప్రసాదిస్తే, ఏదో ఒక ప్రత్యేకవిషయంపై కమ్యూనిస్టులతో భిన్నం కాని కార్యకలాపాలను సూచించేవారి మాట ఏమిటి? వీరినోళ్ళకు కూడా తాళాలు వెయ్యడమేనా? ఇవన్నీ గాలికబుర్లు కావు. ఈ నడుమనే కాంగ్రెసు ఉపసంఘాధ్యక్షు లొకరు :

''వ్యక్తిగత ఉత్సాహంమీద ఆధారపడ్డ మన ఆర్థిక వ్యవస్థపై బొత్తుగా నమ్మకంలేని వామపక్షీయులను కోకొల్ల

లుగా ప్రభుత్వోద్యోగాలలో ఉండనిచ్చినంతకాలం, దేశ విద్రోహసంస్థల ఆటలు కట్టేమాట అబద్ధం'' అన్నారు.

ఈ నిర్వచనం క్రిందికి, సాంఘిక సంక్షేమ వాదులు, టెన్నెసీవాలీ అథారిటీని బలపరచాలనేవారు, సమ్మె మొదలైన కార్మికహక్కులను ఆమోదించేవారు, పెద్దపెద్ద వ్యాపారసంస్థల అధికారం నియమితం చెయ్యాలనేవారు, వ్యాపారస్థుల అధిక లాభాలపై పన్నులు విధించాలని కోరేవారు మొదలైనవారందరూ 'వామపక్షీయ విప్లవకారుల' జాబితాలో చేరి, రాజ్యాంగచట్టం క్రింద లభించే రక్షణకు బాధ్యులవుతారు. కొంతమందికి, రాజ్యాంగపు ప్రథమ సవరణయొక్క రక్షణ వర్తిస్తుందని, కొందరికి వర్తించదని వారు వ్యక్తుల అభిప్రాయాలను అను సరించి నిర్ణయించడం మొదలు పెట్టిననాడు, వారిలో ఏఒక్కరి హక్కులు కూడ ప్రమాదాన్ని తప్పించుకోలేవు. అట్టి పరిస్థి తుల్లో వాక్స్వాతంత్ర్య 'కుంజరయూథం' అధిక సంఖ్యాకవర్గా నికో, ప్రభుత్వాధికారులు తత్కాలంలో ఏర్పరుచుకున్న అభి ప్రాయాలకో పక్కతాళం అనే 'దోమకుత్తుకచొచ్చి' ఊరు కుంటుంది. రష్యాలో సరిగ్గా యిదే పద్ధతి. స్టాలిన్ తన అభి ప్రాయం మార్చుకుంటే ఒకనాటి సంప్రదాయం మరునాటి వితండ వాదంగా మారిపోగలదు. కొన్ని కమ్యూనిస్టేతర దేశాలలో కూడా యింతే. ఎన్నో మధ్యప్రాచ్యదేశాలలో పత్రికా సంపాద కులకు ప్రభుత్వపు పోకడలను విమర్శించే ధైర్యం లేదు. అట్టి అరాచకం చేస్తే, తమ ముద్రణాలయాలను ప్రభుత్వం సమూలంగా కైవసం చేసుకొని తమకు శ్రీకృష్ణ జన్మస్థానం ప్రసాదిస్తుందన్న భయం వారికి. ఇంతెందుకు? బూజుపట్టి లంచగొండితనంతో పుచ్చిపోయిన 'కోమింటాంగు' పార్టీకి వ్యతిరేకంగా షార్మో

జాలో మరివక రాజకీయపార్టీ లేవదీయడానికి ప్రయత్నం చేసి నందుకు లై చెఙ్ అనే అభాగ్యుడిపై దేశద్రోహ నేరంక్రింద అభియోగం తెచ్చాడు చియాంగ్ కై షేక్. లై చెఙ్‌కు ఏడు సంవత్సరాలు బందిఖానా ప్రాప్తించింది. ఇంచుమించు అదే సమయంలో పు చుంగ్ మై అనే పత్రికా సంపాదకుడు రాజ్యాంగ చట్టానికి కేవలం విరుద్ధమైన పద్ధతిలో చియాంగ్‌ను మూడవ సారి రాష్ట్రపతి పదవికి ప్రతిపాదించిన ప్రభుత్వ నిర్ణయాన్ని విమర్శించినందుకు మూడు సంవత్సరాల కారాగారవాసం అనుభవించాడు. అమెరికాలో యిటువంటివి ఒక్కనాటికీ జరుగవు!

నిజానికి, అల్పసంఖ్యాకుల అభిప్రాయాలు, ప్రజాభిప్రాయానికి వ్యతిరేకం అయిన మాటలు—వీనినే వారు చెవులు నిక్కించుకొని వినవలసింది. వారికి అనుకూలమైన విషయాన్ని గురించి విని లాభం ఏముంది? వారి ఊహలతో భిన్నమైన అభిప్రాయాలను తెలుసుకోడమే అంతకన్న ఎక్కువ అవసరం. స్టూ అర్టు మిల్ అన్నట్లు: మరికొంచెం తరిచిచూడడంవల్ల కొత్తగా విన్న విషయంలో వారికి సత్యమే గోచరించవచ్చు. అదికాక, వారి ఊహలే సరియైనవయితే, కేవలం భిన్నమైన అభిప్రాయాలతో సంఘర్షణవల్ల వారి ఊహలలోని సత్యం మరింత స్పష్టపడవచ్చు."

మిల్ మహాశయుడు ఉద్ఘాటించిన సత్యం ఏదో ఒక విషయానికి పరిమితంకాదు. చూడండి! ఒక వ్యక్తిమీద అన్యాయంగా నేరారోపణ జరగవచ్చు. తరుచు జరుగుతూ వుంటుందికూడా. రెండు మూడు దశాబ్దాల కాలం నేరస్థులను వి చా రిం చి విచారించి, 'నేరంచేసి తప్పించుకుపోయిన అదృష్టవంతులకంటె, నిజంగా నేరం చెయ్యకుండా శిక్షను

అనుభవించిన అభాగ్యుల సంఖ్యయే ఎక్కువేమో !' నన్నాడు ఒక న్యాయాధికారి, తన అనుభవాన్ని పురస్కరించు కొని. ఇటువంటి అధర్మాలు జరగకుండా ఉండగలందులకే నిందితునికి హక్కులు, రక్షణలు అవసరం. ఈ రక్షణలయెడ వారు ఉదాసీనులు అయినప్పు డేమవుతుందో తెలుసుకోవా లంటే, దేశభక్తులవునా కాదా, అన్న సంశయంతో యీ నడుమ జరిగిన కార్యాలు ఒక్కసారి పరిశీలిస్తే చాలు. ఒకరు అనుకుని మరొకరిని ఉద్యోగంలోంచి తొలగించారు. గాలికబుర్లేసాక్ష్యంగా మరికొందరు బర్తరఫు చెయ్యబడ్డారు. కిట్టనివారు, తాము సురక్షితంగా అజ్ఞాతవాసంలో వుండి మోపిన అపవాదుల ఫలితంగా ఉద్యోగాలు నష్టపోయివారు సరేసరి. 'ఇటువంటివి, నాదాకా రానీ చూద్దాం' అనుకోరాదు. ప్రక్కయింటికి నిప్పు అంటుకున్నప్పుడు 'మన యింటిదాకా రానీ చూద్దాం' అనుకోడం మొండిధైర్యం. ఇంతకీ చెప్పేదేమిటంటే, 'స్వేచ్ఛ' అనేది అందరూ సమానంగా అనుభవించవలసిన అమృతభాండం వంటిది. ఇందులో ఏ ఒక్కరికి ఆఘాతం కలిగినా—అమృతభాండానికి ఏమూల రంధ్రం పడ్డా—పూర్తినష్టం అందరికే కలిగే మాట తథ్యం.

కాబట్టి గౌరవనీయులైన ప్రముఖుల కోవకు చెందడం వల్ల వారికే ఏ ఇక్కట్టులూ రావనీ, వారి స్వేచ్ఛకు ఏ ఆఘాతం రావనీ ధైర్యం ఉన్నా, వారికంటె సాంఘికంగా తక్కువ స్థితిలోని అభాగ్యులపట్ల ఈ హక్కులపట్టీ(శాసనం)వెలలేని రక్షరేకు వంటిదని, దైవవశంచేత ఔన్నత్యం సిద్ధించిన వారిబోట్లు ఆపట్టికను గౌరవించడం వారి మానవత్వానికి, వారి ధర్మబుద్ధికి చిహ్నం అని వారు ఎన్నటికీ మరువరాదు.

''న్యాయవాదులు, న్యాయస్థానాలు ఈహక్కుల పట్టీని

గురించి శిరోవేదన అనుభవించనీ, నా హక్కులవరకు ఎటూ భయంలేదు!'' అనేది కూడా చాలా భ్రమప్రమాదాలతో కూడు కున్న దృక్పథం. జనాదరణపై ప్రజాస్వామ్యం ఆధారపడి వుంటుంది. ప్రజలు వారే ఈ హక్కులపట్టీని నమ్మకపోతే, న్యాయస్థానాలు మాత్రం ఏవిధంగా యీ హక్కుల్ని అమలు జరుపగలవు? అలా అని శ్రీ డూలే అన్నట్లు 'ఎన్నికల ఫలితా లనుబట్టి న్యాయస్థానాలు' అన్న వాదాన్ని వారు ఒప్పుకోటం లేదు. ఇందుకు కారణాలు అనేకం. మొదటిది: కేంద్ర న్యాయ మూర్తులకి ఎన్నికల ఫలితాలతో ఏవిధమైన సంబంధంలేదు. ప్రభుత్వంలోని మార్పులతో నిమిత్తం లేకుండా కేంద్ర న్యాయ మూర్తులు జీవితాంతం అధికారంలో వుంటారు. రెండవది: న్యాయ మూర్తులను ఎన్నుకునే పద్ధతి అమలులో వున్న ప్రాంతాలలో కూడా, వారి రాజ్యాంగవిధానంలో చిరస్థాయులైన సిద్ధాంతాల పట్ల తత్కాల ప్రజాభిప్రాయానికి వ్యతిరేకించడానికి న్యాయ మూర్తులు వెనుకాడరు, వెనుకాడలేరు. ఇంత నిర్భయంగా వారు చరించడానికి కారణం ఏమిటి? వారి రాజ్యాంగం లోని ప్రాథమిక సూత్రాలపట్ల జనబాహుళ్యం చూపించే గౌరవమే దీనికి కారణం అని వారు నిరాఘాటంగా చెప్ప వచ్చు. న్యాయస్థానాలుచేసిన ప్రతి ఒక తీర్పుతో అందరూ ఏకీభవించినా, ఏకీభవించకపోయినా, రాజ్యాంగంలోని ప్రాథమిక సిద్ధాంతాలను అమలుపరిచే సందర్భాలలో వారి న్యాయస్థానాలు తీసుకునే చర్యలపట్ల, సర్వజనీనమైన ఆమోదం ఇతోధికంగా వున్నదనటం మాత్రం నగ్నమైన సత్యం.

స్వేచ్ఛావాసన, హక్కులపట్టికలో నిర్వచింపబడ్డ ప్రాథ మిక సిద్ధాంతాలు, వారి దైనందిన జీవితాలలో పడుగు పేకలవలె,

ఎంతో చక్కగా అల్లుకుపోయాయి. న్యాయ సిద్ధాంతాలు కోర్టు దాకా వెళ్ళని వేలాది వివాహాలను ఎల్లా ప్రభావితం చేస్తాయో కొత్తగా వృత్తి ప్రారంభించిన ప్రతి న్యాయవాదికీ తెలుసు. అన్ని తగాదాలూ కోర్టుదాకా వెళ్ళవు. దుర్మార్గుడొకడు న్యాయాన్ని తృణీకరించినపుడు, ఏదైనా ఒక విషయంలో చట్టంయొక్క నిర్వచన తేటతెల్లంగా లేనప్పుడు, 'అసలు ఏమి జరిగింది' అన్న విషయంలో వాది ప్రతివాదులకు ఆమోదం కుదరనప్పుడు, ఏ అప్ హౌసువంటివాడో 'నా పిచ్చి నాది' అని మంకు పట్టు పట్టి నప్పుడు మాత్రమే వివాదాలు న్యాయస్థానాలదాకా ప్రయాణిస్తాయి. సముద్ర మధ్యంలోని మంచుకొండ అంచుల రేఖలవంటివి న్యాయస్థానాల తీర్పులు. నిత్యజీవితాన్ని ప్రభావితంచేసే న్యాయం చాలావరకు కోర్టుల తీర్పుల గడబిడలు లేకుండా అజ్ఞాతంగానే తన పని తను చేసుకుపోతుంది.

పౌరహక్కుల విషయంలోనూ అంతే. వాక్స్వాతంత్ర్యం, మతస్వాతంత్ర్యం, పౌరునికి పౌరునికి సఘమ తరతమ భావాలు లేకుండడం, సివిలు హక్కులవంటి విషయాల్లో, జనబాహుళ్యం సామాన్యంగా తమ కర్తవ్యాన్ని గుర్తించి, తమదారిని తాము పోతూ వుంటారు. వివాదంలో కక్షుల వివేచనాశక్తి కుంటువడి నప్పుడు, ఏదో ఒక ముఠా మరింత బలవత్తరం కావాలని యత్నించినప్పుడు మాత్రమే న్యాయస్థానాలకు పని తగులుతుంది.

హక్కులకు ఒక కనీసరక్షణకు మించి న్యాయస్థానాలు నిజానికి మరేమీ యియ్యలేవు. ప్రభుత్వోద్యోగుల చర్యలతో మాత్రమే వాటికి సంబంధం. సాంఘిక బహిష్కారము, వెలి వంటి వానినుండి అల్ప సంఖ్యాక వర్గాలవారిని రక్షించే అధి కారంకాని, శక్తికాని వాటికి లేదు.

అమెరికా హక్కులపట్టిక ఉద్దేశించిన విధంగా న్యాయస్థానపు అవధులు దాటి, భిన్నమైన అభిప్రాయాలయెడ సహనము; వ్యక్తులూ వారి కనీసపు అవసరాలయెడ గౌరవము మొదలైన అంశములతో కూడి, స్వేచ్ఛా సుగంధం మిళితం అయిన దృక్పథం నిత్యజీవితంలో ఒకభాగంగా వారికి సిద్ధించాలి. అతి సామాన్యమైన గ్రామాలలోను, పట్టణాలలోను నివసించే ప్రతి సాధారణ పౌరుని అలవాట్లపైనా, అతని దృక్పథంపైనా, అన్యాయంపట్ల, అక్రమంపట్ల అతను వ్యక్తీకరించే ప్రతిఘటనా పటిష్ఠతమీదా అమెరికా జాతియొక్క నైతిక నైర్మల్యం ఆధారపడి వుంటుందని అమెరికన్లు మరువరాదు.

విద్యారంగం దీనికి చక్కని ఉదాహరణ. రాజ్యాంగ సంబంధమైన సంఘర్షణకు విద్య గురిఅయింది. ఇది సమంజసమే! విద్యకు ఊహాలతో సంబంధం. ఊహాలను సంరక్షించడం హక్కుల పట్టీయొక్క ముఖ్యకర్తవ్యం. అమెరికన్ స్కూళ్ళల్లో ఆరంభం అయే ప్రశ్నలు–స్వేచ్ఛకు సంబంధించిన ప్రశ్నలు–ఒక్కసారి సింహావలోకనం చేద్దాం.

చక్కని విద్య అభ్యసించే హక్కు ఎవరికున్నది? నీగ్రోలకు కూడా, తదితరులవలెనే విద్యాహక్కు ఉన్నదని, వారిని తక్కువ రకానికి చెందిన స్కూళ్లలో వేరుపరచరాదని, ఆవిధంగా వారి యెడల భేదభావం ద్యోతకం కారాదని, కావడం రాజ్యాంగ చట్టానికి విరుద్ధం అని కోర్టు నిర్ణయించింది. అల్ప సంఖ్యాకులైన నీగ్రో పిల్లలను అధిక సంఖ్యాకుల పిల్లలు స్నేహదృష్టితో చూస్తున్నారా, లేక శత్రువులుగా పరిగణించి వారి జీవితాలు దుర్భరం చేస్తున్నారా అన్న విషయాలు ఏచట్టమూ

నిక్కచ్చిగా తేల్చగలిగిన విషయాలు కావు. తమ పిల్లలను మరి ఒక స్కూలుకు మార్చుకునేటట్లు అల్పసంఖ్యాకులైన తలిదండ్రులను సాంఘికంగాను, ఆర్థికంగాను ఒత్తిళ్ళుచేసి అధికసంఖ్యాక వర్గం వారు బలవంతం చెయ్యకుండా ఏచట్టమూ రక్షించనూలేదు. ఇట్టి సూక్ష్మలతో చట్టం వేగలేదు. ప్రజలందరు, జాతి వివక్షత లేకుండా, సమానంగా చూడబడుతున్నారా అన్న విషయం, చట్టాల అమలీకరణమీద ఎంత ఆధారపడివున్నదో, అమెరికన్ల మనఃప్రవృత్తులు, అమెరికన్లు చేసే పనులమీద అంతకంటే ఎక్కువ ఆధారపడివుంటుంది.

అమెరికన్ విద్యాలయాల్లో నేర్పబడవలసిన విద్య ఎటువంటిది? అమెరికాలో విద్యావిధానం నేడు గురుతరమైన సమస్యను ఎదుర్కోవలసివుంది. పాండిత్యము, మేధాశక్తి అన్నవి అమెరికా వంటిస్వతంత్ర దేశాలయొక్క తాతసొత్తు కాదని, సోవియటు రష్యా వంటి నియంతృత్వదేశాలు వారి కేవిఛంగానూ తీసిపోలేదని, వారు సుశిక్షితులైన పౌరులను కోకొల్లలుగా తయారు చేస్తున్నారని ఈ నడుమ అమెరికన్లు గట్టిగా గుర్తించారు. వారు అవలంబించిన విధానం స్వతః కమ్యూనిష్టు విధానంకంటె ఎంతో ఉత్తమమైనది. కాని యీ సౌకర్యాన్ని వారు వినియోగించుకోకపోతే ప్రయోజనంలేదు. భావస్వాతంత్ర్యాన్ని, ఆలోచనలో కొత్తదనాన్ని అమెరికన్ విద్యావిధానంలోని స్వేచ్ఛ పెంపొందించాలి. ఇది స్వతంత్ర దేశాలలోని విద్యావిధానంలో స్వతస్సిద్ధమైన లక్షణం. దురదృష్టమేమంటే సరిగ్గా యిదే విషయంలో అమెరికన్ ప్రభుత్వ పాఠశాలా విధానం అనేకచోట్ల కృతకృత్యం కాలేకపోతున్నది. అందులో అవలంబింపబడే బోధనాపద్ధతిలో కొత్తదనం ఏ మాత్రం లేదు. ఉత్సాహం ఎంతమాత్రం రేకెత్తించడంలేదు.

'చర్య'లకు ఎంతమాత్రం అయినా గురి అయే అనుమానం కల విషయాలను పూర్తిగా వదలి, 'ప్రమాదం' ఏ మాత్రం లేనివి, సామాన్యులందరూ ధారాళంగా సమ్మతించడానికి వీలయిన విషయాలు మాత్రమే బోధిస్తున్నారు బళ్లలో. దీని ఫలితంగా అక్కడి విద్యార్థులకు పూర్తిగా సంప్రదాయ పంజరంలో పెరిగిన చిలక పలుకులు నాలుగు నోట బడుతున్నాయి. దేశభక్తి ప్రమాణ కార్యక్రమాల్లో ఇరుక్కున్న ఉపాధ్యాయులు, పూర్తిగా పరిష్కృతాలైన మనఃప్రవృత్తులు కల అధ్యాపకులు యింతకంటె ఏమి చెయ్యగలరు! వారికిచ్చిన ప్రమాణాలు-ఇదివరలో చెప్పినట్లు-దీనికి ఒక కారణం. సంప్రదాయ విరుద్ధం అయిన పద్ధతిలో పాఠాలు చెప్పే ధైర్యంకల వారియెడ, శాసనసభ జరిపే దర్యాప్తులు—ముఖ్యంగా యూనివర్శిటీ ఉపాధ్యాయుల యెడ—మరి ఒక కారణం.*

చట్టం అనేది ఈ పరిస్థితుల్ని కొంతవరకు మాత్రమే సవరించగలదు. అంతకంటె ఎన్నోరెట్లు ప్రభావితం చెయ్యగలవారు ఉపాధ్యాయులు, ట్రస్టీలు, ఉపాధ్యాయుల సంఘాలు, తల్లితండ్రుల సంఘాలు, విద్యార్థుల సంఘాలు, వార్తా పత్రికా సంపాదకులు, వారి సంపాదకీయాలు, చర్చిలో ఉపన్యాసాలు చెప్పే మతాధికారులు, జనబాహుళ్యం వారి అభిప్రాయాల బలం. వీరందరి చర్యలమీదనే అక్కడి పాఠశాలల్లోను, విద్యాలయాలన్నిటిలోను బోధింపబడే విషయాల నవ్యత, భావనా స్వాతంత్ర్యంయొక్క భద్రత ఆధారపడివుంటుంది.

తర్జన భర్జనలకు గురిఅయిన విషయాలను అక్కడి

* Sweezy V New Hampshie 354, U.S. 254.

స్కూళ్ళల్లో చర్చించేటట్టు చెయ్యాలా? సామ్యవాదమా, పెట్టుబడిదారీ విధానమా? ప్రభుత్వానికి అధికారం ఎక్కువ వుండాలా, వ్యక్తులకా-ఇటువంటి విషయాలు అక్కడి పాఠశాలల్లో చర్చించబడాలా, లేక అక్కడి సంఘప్రముఖులకు నచ్చనట్టి అభిప్రాయాలవేడినుండి చిన్న వాళ్ళను 'రక్షించాలా?' ఇది తప్పక చర్చించవలసిన విషయమే. రెండు వాదాలూ గట్టిగా పరిశీలించవలసిందే.

ప్రభుత్వ పాఠశాలలో ఉపయోగింపబడే పాఠ్యగ్రంథాలు బొత్తిగా 'మిర్చి' 'మసాలా' లేకుండా తయారుచేయబడ్డాయి. ఏమాత్రం ఉత్సాహజనకంగా లేవు. సంప్రదాయాన్ని దేవతగాను, మార్పును పరమవిరోధిగాను చూచే సామాన్యాతిసామాన్యుడైన స్కూలు నిర్వాహక సభ్యుడికి అవి రుచించేటట్లు ఉండాలని అలా తయారుచేశారు. ఆధునిక యుగంలో రాజకీయరంగంలోను, ఆర్థిక రంగంలోనూ ఉద్భవించే ప్రశ్నల ప్రశ్నేలేదు ఈ గ్రంథాల్లో. ఇటువంటి విద్యా విధానమేనా అమెరికన్లకు కావలసినది? ఇదేనా వారు కోరేది?

అసలు, ఏదైనా ఒక చర్చనీయాంశాన్ని తనపాఠంలో ప్రవేశపెట్టి ఒక నవ్యతను సాధించాలనుకొనే గుండె నిబ్బరంగల ఉపాధ్యాయుడికి ఉపాధ్యాయులూ విద్యార్థుల తలిదండ్రుల సమష్టి సంఘాలు ఏమి ప్రోత్సాహం యిస్తున్నాయి? విద్యార్థులు అతనికిచ్చే ప్రోత్సాహం ఏమిటి? కొత్త విషయాల చర్చలో వారి ఉత్సాహం ఏమిటి? కొత్త విషయాల చర్చలో వారు ఉత్సాహంగా పాల్గొంటారా, లేకపోతే యిళ్ళకుపోయి, మా ఫలానా మేష్టారు శుద్ధ సోషలిస్టు అని తల్లిదండ్రులతో ఫిర్యాదుచేస్తారా?

విద్యార్థులు వాళ్ళ ఉపాధ్యాయులతో అన్ని విషయాలూ

కూలంకషంగా చర్చించడం మంచిదా? లేకపోతే, ప్రశ్నలడిగిన ప్రతివాడినీ చెడ్డ కుర్రవాడికింద జమకట్టి, భయభక్తులులేని వాడిక్రింద నిర్ణయించి యిటువంటి అకార్యాలు మరెప్పుడూ చెయ్యకుండా శిక్షించాలా? ఈకారణంగా వాడికి వచ్చే మార్కులు తగ్గవొచ్చా?

స్థానిక వార్తా పత్రికలనుండి ఉపాధ్యాయుడికి ఏమాత్రం బలం లభిస్తోంది? స్థానిక చర్చి అధికారులు ఇస్తున్న బలం ఎంత ?

ఒక హిందూమతస్థుడు, ముసల్మాను, నాస్తికుని వంటి మతాంతరులు క్రైస్తవ ప్రార్థనను* నోట పలకకపోతే, తోడి వారు వారియెడల చూపించే భావం యెటువంటిది? అదేవిధంగా ఒక విదేశీయుడు, యహోవాసాక్షి అమెరికన్ జండాకు నమస్కరించ నంటే వారి సహపాఠులు ఏమంటున్నారు? ఈ మనస్తత్వాన్ని, ఈ అభిప్రాయభేదాన్ని వారు గౌరవిస్తారా లేక తమతో ఏకీ భవించని వారిని తిట్లతో ఆశీర్వదించి దూరంగా తరిమివేస్తారా?

ఈ సమస్యలు కోర్టులదాకా రావు. కాని వీటియెడల అమెరికన్లు అవలంబించే మనస్తత్వమే వారు గడిపే జీవితాల ఉదాత్తతకు కొలతకర్ర.

హక్కుల పట్టీయెడల వారికున్న గౌరవాన్ని పునరు ద్ఘాటించవలసిన అవసరం ఎంతో కనిపిస్తోంది. ఇతరులయెడ గౌరవము, వారి భిన్నత్వముయెడ సహనము, వారితో ఏకీభవిం చని అభిప్రాయాలు కలవారికి ప్రోత్సాహము, ప్రతిమానవుని యెడల మన్నన చూపించమని ఘోషించే సిద్ధాంతాల సంపుటి

* Lord's Prayer.

అది. గౌరవం, నమ్మకాలు, ఆత్మశుద్ధి, స్వేచ్ఛ వంటి విషయాలలో వ్యక్తులను రాష్ట్రాలకంటె ఉన్నతమైన స్థాయికి యెత్తే సిద్ధాంతాల సంపుటి అది.

అమెరికన్ హక్కుల పట్టీలో నిర్వచింపబడ్డ సిద్ధాంతాలు ప్రజాసమూహం యావత్తూ గుర్తించి, గౌరవించి పాలించిననాడే వారి స్వేచ్ఛలు, స్వాతంత్ర్యాలు నిత్యము. సత్యము కాగలవు.

ఇంగ్లీషు వారికికూడా ఒక చక్కని రాజ్యాంగ పద్ధతి వుంది. ఆ విధానంక్రింద తమకు లభించిన స్వేచ్ఛలను గురించి ఆంగ్లేయులు ఛాతీ విరుచుకుని చెప్పుకుంటారు సగర్వంగా. కాని ఈ స్వేచ్ఛలు ఎక్కడా వ్రాసిలేవు. పార్లమెంటు పాసుచేసిన చట్టాన్ని రాజ్యాంగ చట్టానికి విరుద్ధం అని, వ్యక్తుల హక్కులు (రాజ్యాంగచట్టం యిచ్చిన హక్కులు) దెబ్బతిన్నాయని, ఆ చట్టాన్ని అమలుజరిపే ప్రయత్నం తాము సాగనియ్యమని బ్రిటీషుకోర్టులు అనవు. అనే అధికారం వాటికి లేదు. పార్లమెంటు సభ్యులు, ప్రభుత్వోద్యోగులు సమష్టిగా చూపించే పరంపరాగతమైన సంయమనానికి చిహ్నం బ్రిటిషు రాజ్యాంగ విధానం. సోవియటు రాజ్యాంగంలో వ్యక్తులకు ఎన్నో హక్కులు ఉల్లేఖింపబడి ఉన్నాయి. అయినా యీ శిలాక్షరాలు వ్యక్తుల హక్కుల్ని రక్షించలేవు.

అమెరికన్ రాజ్యాంగచట్టం, వారి శాసనసభాసభ్యులు, వారి న్యాయస్థానాలు వ్యక్తపరిచిన అభిప్రాయాలు చాలా ముఖ్యమైన విషయాలు. ఈ మాట ముమ్మాటికీ సత్యమే. కాని సిసలైన స్వేచ్ఛ వారి దైనందిన జీవితాలలో, వారు నిత్యం నివసించే మొహల్లాలలో, పట్టణాలలో, పల్లెలలో, ప్రజలు పరస్పరం

చూపించుకునే మనఃప్రవృత్తులమీద ఎక్కువగా ఆధారపడి వుంటుంది. సజీవమైన అమెరికన్ హక్కులపట్టీకి సరియైన కొలతబద్ద అది.

ఆమధ్య, 1960 ఎలెక్షన్లముందు ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. మనోజమారిన్ అనే కాథలిక్కు పోర్టోరికో గవర్నరు పదవికి పోటీచేశాడు. చాలా భక్తుడు. ఎలెక్షన్ల ముందు రివ్. జేమ్సు పి. డేవిస్, రివ్. జేమ్సు ఇ. మాక్మనస్, రివ్. లూయీ ఎ.రిడ్రిగ్సు అనే ముగ్గురు కాథలిక్కు బిషప్పులు, "మనోజ మారిన్‌కు వోటు యిచ్చినవారు మహాపాపం చేస్తున్నట్టు" అని ఒక బ్రహ్మాండమైన ప్రకటన చేశారు. సాన్ జువాన్ కెథీడ్రల్‌కు పాస్టరయిన టొమాస్ మెయిసొనెట్ అనే అతడు "మనోజ్‌కు వోటువేసినవారు తమ పాపాన్ని ప్రాయశ్చిత్త పూర్వకంగా వొప్పుకుంటేనేకాని భగవత్ప్రసాదం* యివ్వను" అని ప్రకటించాడు. అమెరికా రాజ్యాంగంలో మూలరాయిగా నిలబెట్టుకుంటూ వస్తున్న విషయాన్ని—చర్చి వేరు, రాజ్యాంగం వేరు అన్న విషయం—పూర్తిగా అధిగమించాయి యీ ప్రకటనలు. అయినా తొంభై శాతాలు కాథలిక్కులతో నిండిన ప్రజానీకం ఆ కాథలిక్కు మతాధికారుల మాటలను త్రోసిరాజని మనోజ్ మారిన్‌ను ఎన్నుకున్న విధానం చూస్తే యీ 'మతం వేరు, రాజకీయం వేరు' అన్న సిద్ధాంతం వారిలో చావలేదు సరికదా, ఎంతో పటిష్ఠం అయివున్నది అని స్పష్టం అవుతోంది.

ఆమధ్య వాషింగ్‌టన్‌లో ఒక ప్రయివేటు స్కూలులో చదువుకుంటున్న యిద్దరు కుర్రవాళ్ళు నాకు ఒకచిన్న సంఘటన

* Holy Communion.

వివరించారు. అందులో ఒకడు శ్వేతజాతివాడు, రెండవవాడు కాదు. ఆ నీగ్రో కుర్రవాడు ఒకరోజు తనగదికి వెళ్ళేసరికి : "నిగ్గర్, పో యింటికి" అని ఒకచీటీ కనిపించింది. దానిక్రింద 'కు క్లక్స్ క్లాన్' అని సంతకం వుంది.

"అప్పుడు ఏంచేశావు?" అన్నాను నేను.

"ఒక పిటీషను వ్రాసి విద్యార్థులందరిచేతా సంతకాలు పెట్టించాము. ఆ పిటీషనులో "మేమందరము ఎంతో సిగ్గుపడుతున్నాము" అని వుంది అన్నాడా తెల్ల కుర్రవాడు.

ప్రాణంవున్న హక్కులు అంటే ఇవి!



## Check List

| Book Number | NPR01.D181 | Date | 8/4/23 |
|---|---|---|---|
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 88, 89, B | | |
| Missing Pages | no | | |
| Prepared By | p. pragathi | Cutting By | p. pragathi |
| Scanned By | d. Ramya | Pages | 97 |